LYING, JEALOUSY, &
BACKBITING (Telugu)

# అసత్యము (అల్ కజిబ్)
# ఈర్ష్య (అల్ హసద్)
# పరోక్ష నింద (అల్ గీబ)

**(ముస్లిమ్ సమాజంపై వాటి దుష్ప్రభావాలు)**

*సంకలనం :*

**అబ్దుల్లాహ్ జుల్ఫిఖార్ అలీ**

*ప్రకాశకులు :*

క్వెస్ట్ ఫర్ ట్రూత్ అండ్ అటైన్మెంట్
# 17-1-375/ఇ/35/14/1,
ఖుర్షీద్ జాహి మస్జిద్ ప్రక్కన, సంతోష్నగర్,
సఈదాబాద్, హైదరాబాద్ - 500 059
Cell : 9247191301

Name of Book : LYING, JEALOUSY, & BACKBITING (Telugu)

Compiler : **Abdullah Zulfeqar Ali**



First Edition : 2014

**Price : Rs. 40**



*Publishers :*

**Quest For Truth & Attainment**

# 17-1-375/E/35/14/1, Near Khursheed Jahi Masjid,
Santosh Nagar, Sayeedabad, Hyderabad - 500 059

Cell : 9247191301

**Timings:** 10 a.m. to 12-00 Noon, Evening :6-00 to 9-00 p.m.

**Note :** ఈ పుస్తకాన్ని కావాలనుకొనేవారు 40 రూపాయలు యం.ఓ. చేస్తే ఒక కాపీని కొరియర్ ద్వారా పంపిస్తాము.

# విషయసూచిక

LYING (Telugu)

# అసత్యము (అల్ కజిబ్)

సంకలనం :

**అబ్దుల్లాహ్ జుల్ఫిఖార్ అలీ**

ప్రకాశకులు :

క్వెస్ట్ ఫర్ ట్రూత్ అండ్ అటైన్‌మెంట్

# 17-1-375/ఇ/35/14/1,

ఖుర్షీద్ జాహి మస్జిద్ ప్రక్కన, సంతోష్‌నగర్,

సఈదాబాద్, హైదరాబాద్ - 500 059

Cell : 9247191301

*బిస్మిల్లాహ్ హిర్రహ్మా నిర్రహీం*
*అమిత దయాళు అపార కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో*

# ముందుమాట

1. సర్వ స్తోత్రాలు అన్ని ప్రపంచాలకూ ప్రభువైన అల్లాహ్‌కే (సుబహానహువతఆలా). శాంతి మరియు ఆశీర్వాదాలు సర్వప్రవక్తలలో మరియు సందేశహరులలో అత్యుత్తమ గౌరవనీయులైన ఆ ప్రవక్తపై (ఉండుగాక).

2. అల్లాహ్ (సు.త) ముస్లిం అనుయాయులను (ఉమ్మ) వారి విశ్వాసాల్లో పవితత్ర, వారి చేష్టలలో మరీ వారి ప్రవచనాలలో పరిశుద్ధత ఉండాలని నిర్దేశించారు. సత్యసంధత ఒక దేశం యొక్క సంతుష్టత, దాని పరిశుద్ధ ఆత్మకు తార్కాణం, సదా నిజం పలకడం, దేవునిపై అఖుంఠిత విశ్వాసం కలిగి ఉండడం ఆనందానికి దారైతే, అసత్య ప్రేలాపనలు, మరియు దైవధిక్కారం, నికృష్ఠత్వానికి, దుఃఖానికీ దారితీస్తాయి.

3. అల్లాహ్ (సు.త) నిర్జీవులను, పునర్జీవితం చేసే ఆ రోజు మన సత్యసంధత తప్ప మిగిలినవేమీ సహాయకారిగా ఉండవని మనకు తేటతెల్లం చేశారు. అల్లాహ్ (సు.త) అసత్యవాదిని (కాదిబ్), నమ్మకద్రోహులను స్పష్టంగా గుర్తించేలా వారికి ఓ జండా యిస్తారు. అల్లాహ్ (సు.త) నమ్మకద్రోహులపై చేసే నిందాపనిందలన్నీ వారి అసత్య భాషణలతో మరియు అసభ్య చేష్టలతోనే ఆవిర్భవించాయి.

## అసత్యము

“నిజంగా అల్లాహ్ అసత్యవాదిని, మరియు ఆయనను (సు.త) నిరాకరించే వ్యక్తిని రుజుమార్గం వైపు నడిపించడు.”

అబ్దుల్లాహ్ (ర.అ) వివరించిన ప్రకారం దైవప్రవక్త (స.అ.సం) ఇలా చెప్పారు : "సత్యసంధత (అల్–బిర్ర్) అనగా దైవభయం, సత్ప్రవర్తనకు మరీ దైవాజ్ఞలను శిరసావహించేందుకు దారి తీస్తుంది. మరీ దైవభీతి స్వర్గానికి దారి తీస్తుంది. ఒక మానవుడు సత్యాన్ని పలుకుతూ, పలుకుతూ "సిద్దీఖ్" (నిజాన్ని పలికే వ్యక్తి) అయిపోతాడు. అసత్యం (అబద్ధం) చెడ్డ పనులకూ, అక్రమ దౌర్జన్య అన్యాయాలకూ (అల్ఫుజూర్) దారితీస్తుంది. అల్ ఫుజూర్ (మనిషిని) నరకాగ్ని జ్వాలల్లో పడేస్తుంది. ఓ వ్యక్తి అబద్ధాలు చెబుతూ చెబుతూ 'అబద్ధాలఖోరు'గా (లిఖింపబడతాడు) ముద్రవేయబడతాడు, అల్లాహ్ (సు.త) వారి సముఖంలో." (సహీహ్ అల్ బుఖారీ : 6094)

**– సంకలనకర్త**

# అసత్యము నిషిద్ధము

అసత్యము పలకటం హేయమైన పాపం మరీ సిగ్గుపడవలసిన కార్యం.

అల్లాహ్ (సు.త) సెలవిచ్చారు ఈ విధంగా :

"నీకు తెలియని దానిని పాటించకు." (17:36)

"ఒక్క పదము కూడా లేదు ఆయన ఉచ్చరించినది మరియు సిద్ధముగా నున్న పరిశీలకుడు (ఫరిష్తా) లిఖింపనిది." (50:17,18)

ఇబ్న్ మస్ఊద్ (ర.అ) వాక్రుచ్చిరి : దైవప్రవక్త (సఅసం) ఇలా చెప్పారు:

"సత్యశీలత రుజుప్రవర్తనకూ ఆపైన రుజుప్రవర్తన స్వర్గానికీ దారిచూపుతాయి. ఒక వ్యక్తి సదా నిజం చెపుతూ చెపుతూ ఉంటే అల్లాహ్ (సు.త) అతనిని (సిద్దీఖ్) సత్యశీలిగా పరిగణిస్తాడు. అసత్యం, క్రూరత్వానికి మరి క్రూరత్వం నరకాగ్నిజ్వాలల్లోకి తీసుకుపోతుంది. ఒక వ్యక్తి అబద్ధాలు పలుకుతూ పోతూ అల్లాహ్ (సు.త) వద్ద 'అసత్యవాది' (అబద్ధాలఖోరు) గా లిఖింపబడతాడు." (అల్ బుఖారి మరియు ముస్లిమ్).

విజ్ఞానులు (ఇలా) చెప్పారు : "సత్యసంధత స్వచ్ఛమైన ఆమోద యోగ్యమైన కార్యకలాపాలకు దారితీస్తుంది. అసత్యము చెడు కార్యాలకు దారిచూపుతుంది. ఇది సత్పధము నుండి దారి తప్పిపోవటమే."

ఇతర జ్ఞానులు ఇలా అన్నారు :

"అది (అసత్యము) పాపపంకిలాల్లోకి లాగేస్తుంది. అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ అల్ ఆస్ (ర.అ) విశదీకరించారు : దైవప్రవక్త (సఅసం) అన్నారు :

"ఎవరిలోనైన ఈ నాలుగు లక్షణాలు ఉంటే, అతడు స్వచ్ఛమైన విశ్వాసఘాతకుడే. ఎవరిలోనైనా ఈ నాల్గు గుణాలలో ఏ ఒక్కటి ఉన్నా, అతడు దానికి తిలోదకాలిచ్చే వరకు అతనిలో ఒక విశ్వాస ఘాతుక లక్షణం ఉన్నట్లు. (ఆ నాలుగు లక్షణాలు ఇవి) : 1. అతనికి ఏదైన వస్తువును సంరక్షణకై ఇస్తే విశ్వాసఘాతం చేస్తాడు. 2. ఎల్లవేళలా అబద్ధమే చెబుతాడు. 3. అతనితో ఎలాంటి అంగీకారం కుదుర్చుకున్నా ఆ అంగీకారాన్ని త్రోసిపుచ్చుతాడు. 4. ఎన్నడు వాదులాడినా అతను దుష్ప్రవర్తనతో (ఇతరులను) అమర్యాద మరియు అవమానాల పాలు చేస్తాడు. (అల్ బుఖారీ & ముస్లిమ్)

దైవప్రవక్త (సఅసం) దీనిని గర్హిస్తూ తమ ప్రసంగంలో ఇలా అన్నట్లు ఉటంకింపబడినది :

"ఒక వ్యక్తి తాను వినిన అన్ని విషయాలనూ చెప్పేస్తుంటే ఆ వ్యక్తి 'అసత్యవాది' కావటానికి ఈ కారణం ఒక్కటే సరిపడుతుంది." (ముస్లిమ్ మరియు అబూదావూద్)

దైవప్రవక్త గారు (సఅసం) ఈ విధంగా కూడా సెలవిచ్చినట్లు తెలుస్తున్నది.

"ఒక దేవుని బానిస (మానవుడు) అసత్యాలు పలుకుతూ ఉంటూ అబద్ధాలు చెప్పటానికి మరింత శ్రమపడుతూ చివరికి అల్లాహ్ దగ్గర అబద్ధాలరాయుడుగా లిఖింపబడతాడు." (అల్ బుఖారీ మరియు ముస్లిమ్)

నా ముస్లిమ్ తమ్ముడా, అసత్యవాదులకు రాగల దుష్పరిణామాలను చూసి భయపడు. ఎందుకంటే అన్ని దుష్కార్యాలకూ, మరీ క్రూరత్వాలకూ ఈ అసత్యమే మూలకారణం. ప్రవక్తగారు (సఅసం) సెలవిచ్చారు :

"అసత్యం క్రూరత్వానికీ, క్రూరత్వం నరకాగ్ని జ్వాలల్లోకి దారితీస్తుంది." (అల్ బుఖారీ & ముస్లిమ్)

# అసత్యం ఎట్టి పరిస్థితుల్లో చెప్పవచ్చు?

అబద్ధాలు చెప్పటం చేయకూడని పని. ఎందుకంటే దీనివలన ఇతరులకే కాకుండా స్వయానా అబద్ధం చెప్పే వ్యక్తికి కూడా నష్టం వాటిల్లుతుంది. కాని కొన్ని పరిస్థితుల్లో అబద్ధం చెప్పడానికి ఆమోదం కలదు – మరికొన్ని సందర్భాలలో అత్యవసరం కూడా. అయితే అసత్యము పలుకవలసిన అవసరం లేకుండానే ఏదైనా ప్రశంసనీయమైన, న్యాయనిర్దేశమైన పని పూర్తికావడానికి ఆస్కారం వుంటే ఆ పరిస్థితుల్లో అబద్ధం చెప్పటం నిషిద్ధప్రాయమౌతుంది. ఇదే దానికి హద్దు. కాని అలాంటి (ప్రశంసనీయన, న్యాయమైన పని) కార్యపరిపూర్తికి వేరే దారిలేకపోతే, అబద్ధం ఉపయోగకారీ, ఆమోద యోగ్యమూ ఔతుంది. మరీ, ఓ న్యాయనిర్దేశితమైన గమ్య ప్రాప్తికై తప్పనిసరైనచో అసత్యవాక్కు ఆమోదయోగ్యం ఔతుంది.

అసత్యం అత్యవసర పరిస్థితులలోనూ అవసరమే ఔతుంది. ఉదాహరణకు : ఒక ముస్మిమ్ కిరాతకుల బారినుండి తప్పించుకోవడానికి తనను లేక తన ధనాన్ని దాచే ప్రయత్నంలో ఉంటాడు. ఆయన లేక ఆయన ఆస్తిని పరిరక్షించటానికై ఆయనను గురించి ఎవరైనా అడిగితే అబద్ధమాడటం తప్పనిసరిఔతుంది. ఇలాంటి పరిస్థితుల్లో (తౌరియ) అంటే అబద్ధాలతో పాటు కొంత సత్యాన్ని కూడా చెప్పడం శ్రేయస్కర వివేకము. అసత్యాన్ని గురించి విజ్ఞానవంతులు తమ ఇస్లామీ నిర్ణయాలను ఈ క్రింది ఐదు నియమాలను అనుసరించే ఇచ్చారు. ఏది ఏమైనా అసత్యవాక్కు హరామే (నిషిద్ధము) అని తెలిపారు.

1. మొదటి ధర్మనిర్ణయం : హరామ్ లేక నిషిద్ధము.

2. రెండవ ధర్మ నిర్ణయం : మక్‌రూహ్ లేక అసహ్యకరమైనది. ఉదా ॥ తల్లిదండ్రులను, భార్య లేక భర్తను లేక పిల్లలను సముదాయించటానికై (అసత్యాన్ని) ఉపయోగించడం.

3. మూడవ ధర్మ నిర్ణయం : మందూబ్ లేక ప్రోత్సహించబడినది. ఉదా ॥ ఇస్లాంలో జిహాద్(ధర్మయుద్ధం) చేసే సమయంలో శత్రువులను భయాందోళనలకు గురిచేయుటకై ముస్లింల గురించి, వారి ఆయుధ సంపత్తి గురించి నిజానికి అతీతంగా పెంచి చెప్పడం.

4. నాలుగో ధర్మనిర్ణయం వాజిబ్ – అత్యవసరము : ముస్లింల ధన మాన ప్రాణాలను రక్షించుటకై అబద్ధాన్ని ఉపయోగించడం.

5. ఐదవ ధర్మనిర్ణయం : ముబాహ్ లేక ఆమోదయోగ్యం. ఉదా: ప్రజల మధ్య సయోధ్య సత్సంబంధాలు నెలకొల్పటానికై ఉపయోగించడం.

అల్లాహ్ (సు.త) వారి ఉద్గ్రంథంలో అసత్యాన్నీ, అసత్యవాదులనూ పలుమార్లు తీవ్రంగా ఖండించటం వలన ఇస్లామీ ధర్మ శాస్త్రవేత్తలు సర్వదా అసత్యాన్ని 'గొప్పతప్పిదం'గా పేర్కొన్నారు.

**తఅరీద్ : సలఫ్** (తమ అకుంఠిత విశ్వాసాలకు పేరు మోసిన సహాబాలాంటి మన పూర్వీకులు)

వారి గురించి వాడుకలో ఉన్న కథనాల ప్రకారం ఈ 'తఅరీద్' లో మనకూ కొంత ఊరట లభిస్తుంది. నిజాన్ని ఓ ప్రత్యేకమైన పంథాలో వివరించటం జరుగుతుంది. కాని వినేవాడు మరోవిధంగా అర్థం చేసుకొంటాడు. దీని అర్థం ఒక వ్యక్తి అబద్ధమే చెప్పవలసివస్తే ఈ పద్ధతి అవలంబించవచ్చు. అవసరములేని చోట 'తఅరీద్' లేక అసత్యము ఉపయోగానికి ఆమోదముద్ర కాదు. అయితే తఅరీద్ అనేది చిన్న తప్పిదమే ఔతుంది.

**తఅరీద్ :** ఉదాహరణకు: ఒక కథనంలో ముతఅ్రిఫ్, జియాద్ దగ్గరికి వెళ్ళగా ముతఅ్రిఫ్ ఆలస్యంగా రావటానికి కారణం అడిగాడు జియాద్. ముతఅ్రిఫ్ తాను అనారోగ్యంతో ఉన్నట్లు సాకు చెప్పాడు. ఆయన ఇలా అన్నాడు : "నిన్ను వదలివెళ్ళినప్పటి నుంచీ నేను నా శరీరాన్ని (మెత్త) పరుపుపై నుండి లేపలేకపోయాను. ఎంతవరకంటే తర్వాత అల్లాహ్ (సు.త) నన్ను లేపేవరకు."

♦ ఉమర్ బిన్ అల్ ఖత్తాబ్ (ర.అ) వద్ద ముఆజ్ బిన్ జబల్ (ర.అ) పనిచేసేవాడు. ఆయన తన భార్య వద్దకు తిరిగిరాగా ఆమె "ఇతరులు తమ కుటుంబస్తులకు తెస్తున్నట్లు నీవు కూడ ఏమైనా తీసుకరావచ్చు కదా" అని ప్రశ్నించింది. ఆయన అన్నారు : 'నాపై కన్నువేసేవారు ఉన్నారు'. ఆమె అన్నది : దైవప్రవక్త (సఅసం) కూడా నమ్మే విశ్వాసపాత్రుడవు నీవు. దైవప్రవక్త (సఅసం) మరీ అబూబక్ర్ (రజి) కూడా నీపై నమ్మకం ఉంచేవారు. మరి యిప్పుడు ఉమర్ (రజి) నీపై పరిశీలకున్ని నియమించాడా? ఆపై ఆమె తన స్నేహితురాళ్ళతో ఉమర్ (రజి) గురించి తన ఆక్రోశం వెలిబుచ్చింది. ఈ వార్తలు విన్న ఉమర్ (రజి) ముఆజ్ (రజి) ను పిలిచి ఇలా ప్రశ్నించాడు. నేను నీపై పరిశీలకున్ని నియమించానా? ఆయన బదులిచ్చారు: నేను నా భార్యకు ఇంతకంటే వేరే సాకు చెప్పలేకపోయాను. ఉమర్ (రజి) నవ్వేసి, 'మీ భార్యను సంతోషపెట్టండి' అంటూ ఏదో వస్తువు కానుకగా ఇచ్చారు. ముఆజ్ (రజి) గారి దృష్టితో పరిశీలకుడంటే అల్లాహ్ (సు.త) మాత్రమే.

♦ అన్-నఖీ తన కుమార్తెతో ఇలా అనేవాడు : "నేను నీ కోసం చక్కెర కొంటే నువ్వేమనుకొంటావు?" కాని 'నీ కోసం చక్కెర కొంటాను' అని అనేవారు కాదు. ఎందుకంటే ఏదో కారణంగా తాను చక్కెర కొనలేనో యేమో అని తలిచాడు.

♦ "ఇబ్రాహీం"ను కలవటానికి ఎవరైనా ఆయన ఇంటికి వస్తే వారిని కలవటం ఆయనకు సుతరామూ ఇష్టం లేదు. ఆయన తన పని మనిషితో ఇలా చెప్పేవాడు. "నన్ను మస్‌జిద్‌లో కలవమని ఆయనకు చెప్పు. కాని నేను ఇంట్లో లేనని అబద్ధం మాత్రం చెప్పకు."

♦ "అష్షాబీ" కోసం ఎవరైనా ఇంటికి వస్తే అతనికి వాళ్ళను కలవడం చాల అయిష్టం. ఆయన ఒక 'వలయం' గీసి తన పని మనిషికి యిలా చెప్పేవారు. 'నీ వేలు ఒకటి ఈ వలయంలో పెట్టి వచ్చినవాళ్ళతో "ఆయన ఇక్కడ లేడు" అని చెప్పు. అవసరమైన సందర్భాలలో "తఅరీద్"ను వాడుకొన్నట్లు పలు ఉదాహరణలు ఉన్నాయి. కానీ అవసరం లేనప్పుడు 'తఅరీద్'ను ఉపయోగించరాదు. వినేవాడు నిజానికి తఅరీద్‌ను అతీతంగా వేరొక విధంగా అర్థం చేసుకొంటాడు. తఅరీద్ పదజాలాన్ని అసత్యంగా పరిగణించరు. సామాన్యంగా 'తఅరీద్' అయిష్టమైనదే.

♦ అబ్‌దుల్లా బిన్ ఉత్‌బ అన్నాడు :

"నేనూ మా నాన్నా ఉమర్ బిన్ అబ్‌దుల్ అజీజ్‌ను సందర్శించాము. తిరిగి వచ్చేవేళ నాకో "తోబ్" (అరబ్బులు ధరించే జుబ్బా) తెచ్చారు. 'ఇది మీకు ఉమర్ ఇచ్చారా' అని ప్రజలు అడిగితే నేను యిలా జవాబిచ్చాను: "అల్లాహ్ (సు.త) అమీరుల్ మోమినీన్ (అంటే ఉమర్ బిన్ అబ్‌దుల్ అజీజ్)కు ప్రతిఫలం యిచ్చుగాక". ఓ పుత్రుడా! అసత్యం లేక దాని లాంటిది చెప్పేముందు జాగ్రత్తపడు అని మా నాన్న సలహా ఇచ్చాడు.

ఆయన తండ్రి అలా చెప్పవద్దని వారించాడు. ఎందుకంటే ప్రజలు అపార్థం చేసుకొని ఈ తప్పుడు సమాచారాన్ని మనసులో పెట్టుకుంటారు. రెండవది దీంట్లో పటాటోపం కూడ కలసి ఉంది. ఇది ఎవరికీ ఎలాంటి మంచి చేకూర్చదు.

# అసత్యవాది ఉద్దేశ్యాలు

కల్మష హృదయం గల వ్యక్తిని అసత్యాన్ని పలికేలా ప్రేరేపించే ఉద్దేశ్యాలు చాలా ఉన్నాయి.

1. అల్లాహ్ (సు.త) అంటే నిర్భయుడై ఉండటం. ఆయన (సు.త) అన్నివేళలా తనను చూస్తున్నాడనే విషయాన్ని మనసులో ఉంచకపోవడం.

2. యధార్థాలను మార్చివేసి వాటికి బదులు కాల్పనిక అసత్య సమాచారాన్ని అందించటం, గొప్పలు పలుకటానికై లేక ప్రాపంచిక లబ్ధి వగైరాలకై నిజమైన విషయాలను తక్కువ లేక ఎక్కువగా చేసి చూపించటం. ఉదాహరణకై ఓ వ్యక్తి తాను కొన్న భూమికై లేక వాహనానికై చెల్లించిన మూల్యం గురించి జీవన భాగస్వామితో లేక ఇతరులతో అసత్యం పలుకటం.

3. ఇతరుల దృష్టిని ఆకర్షించటానికి ఒక మిత్రమండలిలో చేరి అబద్ధాలు చెప్పడం లేక కల్పిత కధలు అల్లటం.

4. క్లిష్ట పరిస్థితుల్లో మరియు గడ్డుదినాలలో యదార్థ విషయాల నుండి తప్పించుకోవటం లేక విధ్యుక్త ధర్మాలను నిర్వర్తించే పసలేక పోవటం.

5. బాల్యం నుంచే అబద్ధాల రోగాన్ని అంటించుకోవటం. దీనికి కారణం అతనికి చిన్నతనంలో సరియైన క్రమశిక్షణతో కూడిన తగు పోషణ లభించకపోవటమే. తలిదండ్రులు అబద్ధాలు చెబుతూ ఉంటే, పిల్లలూ పెద్దయ్యాక అబద్ధాలే ఏకరువు పెడతారు.

6. అసత్యవాది తన పటాటోపంతో లావాదేవీలు చేయటంలో అసత్యం ద్వారా తన తెలివితేటలను ఉపయోగించి తాను అందరికంటే చాలా ఘనుడనని చాటిచూపుతాడు.

# ప్రజల దృష్టిలో అబద్ధం కోవలోకి వర్గీకరింపబడని విషయాలు

కొన్ని అసత్యాలు, ఉదాహరకు గొప్పలు చెప్పుకోవటం. ("ఫుసూఖ్") పెద్దపాపంగా పరిగణించబడవు. "నేను ఫలానన్నిసార్లు పిలిచాను" లేక 'నేను వందసార్లు చెప్పాను' అని అనవచ్చు. ఎన్నిసార్లు పిలిచారో లేక చెప్పారో సరియైన సంఖ్య కాదు. కాని అది విషయానికి ప్రాముఖ్యత అంటగట్టడానికి చేసిన యత్నమే. ఇలాంటి సందర్భంలో ఒక వ్యక్తి రెండో మనిషిని ఒకేసారి పలిచాడు, కాని వందసార్లు పిలిచాననటం వలన ఆయన అబద్ధాలఖోరే ఔతాడు. కాని అతడు వందసార్లు పిలవక పోయినాసరే, పలుమార్లు పిలిచినందున అసత్యవాది కానేరడు. పై రెండు ఉదాహరణల్లోనూ అంచెలవారీ తారతమ్యం ఉన్నది. అయితే పటాటోపానికి అలవాటుబడ్డ వ్యక్తి నాలుక అబద్ధాలకే ప్రాముఖ్యతనిస్తుంది. మనుషులు ఈ క్రింది విధమైన ప్రవర్తనలను పెద్దగా పట్టించుకోరు. ఒక వ్యక్తి "తినండి" అంటే ఇలా జవాబిస్తాడు : "నాకీ తిండి సరిపడదు" లేక 'నాకు ఆకలి లేదు' అంటాడు. కాని నిజంగా ఆ వ్యక్తి ఆకలితోనే వున్నాడు. మంచి ఉద్దేశ్యంతోనే అలా చెప్పినా ఇలాంటి చేష్ట నిషిద్ధమైనది. మరియు హరామ్ కూడా. ముజాహిద్ వివరించిన ప్రకారం అస్మా బిన్తే ఉమైఅస్ (ర.అ) ఇలా అన్నది.

ఆయిషా (ర.అ) గారి నికాహ్ దైవప్రవక్త (సఅసం) తో ఔతున్న సందర్భంలో ఆమెతో ఉన్నవారిలో నేను ఏకైక స్త్రీని. మా వద్ద యివ్వటానికి ఓ కప్పు పాలు తప్ప ఏమీ లేదు. ప్రవక్తగారు (సఅసం) కొంత త్రాగి ఆ కప్పును ఆయిషా (ర.అ) గారికి ఇచ్చారు. ఆయిషా (ర.అ) సిగ్గుపడగా "ప్రవక్తగారి (సఅసం) చేతినుండి తీసుకో, తిరస్కరించకు" అని అన్నాను.

ఆమె సిగ్గుపడుతూ కప్పును తీసుకొని కొంత త్రాగింది. ప్రవక్త (సఅసం) గారు "మీ చెలికాండ్రకు ఇవ్వండి" అని చెప్పారు. ఆమె చెలికత్తెలు "మాకు తాగాలని లేదు" అని అన్నారు. ప్రవక్త (సఅసం) గారు "ఆకలిని అసత్యంతో మిళితం చెయ్యవద్దని" వాళ్ళతో అన్నారు. అప్పుడు నేను ప్రవక్త (సఅసం) తో ఇలా అన్నాను : "తనకు వచ్చిన ఓ వస్తువును, నాకు కోరిక లేదని తిరస్కరించటం అసత్యం ఔతుందా?". ఆయన (సఅసం) ఇలా సెలవిచ్చారు

"ఒక అసత్యం, అసత్యంగానే రాయబడుతుంది. ఒక చిన్న అబద్ధం కూడా చిన్న అబద్ధంగానే లిఖించబడుతుంది. (దీని అర్థం చిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా అబద్ధం తప్పకుండా వ్యక్తి లెక్కలో రాయబడుతుంది).

(ఇబ్న్ అబుద్దున్యా మరియు అహ్మద్)

సత్య విశ్వాసవంతులు ఇలాంటి అసత్యాలకు దూరంగా ఉంటూ వాటిని సహించేవారు కారు.

అల్‌లైత్ బిన్ సఅద్ వక్కాణించారు :

సఅఇద్ బిన్ అల్ ముసైయబ్ కంటిలో నుండి ఓ తెల్లటి ద్రవపదార్థం స్రవించేది. "ఎందుకు నీ కళ్ళను తుడుచుకోవు" అని నేను ప్రశ్నించాను. వైద్యుడు కళ్ళు తుడవకూడదని అన్నాడనీ మరీ వైద్యుడడిగినప్పుడు తుడుచుకోలేదని జవాబు చెప్పానని నాతో అన్నాడు."

సత్యసంధుల మనసుల్లో ఈ విషయం ఎప్పుడూ కదలాడుతూనే ఉంటుంది. ఒక వ్యక్తి చిన్న విషయాల్లో అబద్ధాలు చెప్పడాన్ని సహిస్తే, మరికొన్ని వేళల్లో తనకు తెలియకుండానే అసత్యమాడేస్తాడు. అర్ రబీ బిన్ ఖుతైయిమ్ చెల్లెలు ఆయన రోగగ్రస్థ కుమారుడిని చూడవచ్చింది. రోగిని ఆలింగనం చేసి 'ఎలా ఉన్నావు కుమారా' అని అడిగింది. "నువ్వు ఆయనకు బాల్యంలో పాలు త్రాపావా? అని అడిగాడు, రబీ బిన్ ఖుతైయిమ్ 'లేద'ని ఆమె జవాబిచ్చింది.

"అలాగైతే ఆయన్ని మా అన్న కొడుకా అని పిలిచి నిజం చెప్పు" అని అన్నాడు.

"అల్లాహ్ (సు.త) కు ఫలానా ఫలానా ఘటన తెలుసు" అని ప్రజలు మామూలుగా మాట్లాడుకుంటారు. కాని అలా మాట్లాడే వ్యక్తికి ఆ విషయాన్ని గురించి నిజానిజాలు తెలియవు.

ఈసా బిన్ మరియమ్ (అస) ఇలా అన్నారు :

"తనకు స్వతహాగా తెలియని విషయాన్ని అల్లాహ్ (సు.త) కు తెలుసునని ఒక దాసుడు పలకటం కంటే వేరే గొప్ప పాపం అల్లాహ్ (సు.త) దృష్టిలో మరొకటి లేదు".

ప్రజలు తమ కలలను గురించి అబద్ధాలు చెబుతారు. ఇది గొప్ప పాపం.

దైవప్రవక్త (సఅసం) గారు సెలవిచ్చారు :

"తాను చూడని స్వప్నాన్ని చూసినట్లు, లేక నేను (సఅసం) చెప్పని విషయాలను ఏదో చెప్పినట్లుగా వారి తండ్రులు కాని వ్యక్తులతో అబద్ధ ప్రేలాపలను చేయటం సమస్త పాపాల్లో అతి గొప్ప పాపం ఔతుంది."

దైవప్రవక్త (సఅసం) మరీ ఇలా అన్నారు :

"కలల గురించి అసత్యం పలికే వ్యక్తి (తాను చూడని స్వప్నాన్ని గురించి ఇతరులకు చెప్పటం) పునరుత్థానదినాన రెండు బార్లీ గింజల మధ్య ముడివేయమని ఆజ్ఞాపించబడగా, ఆ పనిని ఎప్పటికీ చేయలేకపోతాడు." (అల్ బుఖారి, అత్ తిర్మిజీ)

**అసత్యపు కోవకు చెందని మరియు తేలికగా తీసుకోబడే అంశాలు:**

(1) మొదటి అంశం : ప్రజల యొక్క విభిన్న ప్రవర్తనలలో మరియు పలు రకాల ప్రకటనలలో అబద్ధపు పరిధిలోకి రానట్లే తాము పరిగణించే విషయాలు కూడా ఉన్నాయి.

తన వద్ద ఇచ్చేందుకు ఏమీ లేకపోయినా ఎవరైనా చిన్ని పిల్లవాడిని పిలవటం. అబ్‌దుల్లాహ్ బిన్ అమ్‌ర్ బిన్ ఆస్ (రఅ) చెప్పాడు.

"ప్రవక్తగారు నా బాల్యంలో మా ఇంటికి వచ్చారు. నేను ఆటలాడటానికై బయటికి వెళ్ళాను. 'ఓ అబ్‌దుల్లాహ్, ఇటు రా, నీ కేదో యిస్తాన'ని మా అమ్మ పిలిచింది. ప్రవక్త (సఅసం) ఇలా అన్నారు : "ఆయనకు నీ వేమి ఇస్తానను కొంటున్నావు?" ఆమె, 'ఖర్జూరాలు' అని అన్నది. 'నీవు నిజంగానే వాటిని ఇవ్వకపోతే నీ మాట అసత్యంగా రాయబడుతుంద'ని ప్రవక్త (సఅసం) అన్నారు. (అబూ దావూద్ + అహమద్)

మరి నాన్నలారా! అమ్మలారా! ఇలాంటి దుష్ప్రవర్తనని బాగా గుర్తుంచుకోండి. ఇలాంటి అబద్ధాల వలన తమకు పిల్లల ఏడ్పుల వలన మరియు వారి అలకల వలన కలిగే అశువిధ దూరమౌతుందనుకుంటారు. కాని అది సత్య విదూరం. మనం ఇస్లామీయ నీతులను ఆధారంగా చేసుకొని మన పిల్లలని పెంచి పెద్ద చేయాలి. మనం అన్నింటికీ అతీతంగా సత్యసంధత అనే గుణాన్ని వారి మనసుల్లో నాటువేయాలి. మనం వారికి అబద్ధాలు చెప్పకూడదు. ఇదే వారికై ఒక చెడ్డ ఉదాహరణ అయి వారు అసత్యవాదులవటానికి ప్రోత్సాహకరం ఔతుంది.

మన దృక్పథంలో స్వల్ప విషయాలుగా అనుకొనేవి కూడా పిల్లల మనసుల్లో పాతుకపోయి, ప్రగాఢ ముద్రవేస్తాయి. వారు కూడా పెద్దలను అనుసరిస్తారు. దీనికి మంచి ఉదాహరణే అబ్‌దుల్లాహ్ బిన్ అమ్‌ర్ (ర.అ) గారు జ్ఞాపకం తెచ్చుకొని అతని బాల్యంలోని తన అమ్మను గురించి చెప్పబడిన పై హదీసు.

(2) రెండవ అంశం : విన్నదంతా తు.చ. చెప్పేయటమే. అబూ హురైర (ర.అ). దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నట్లు చెప్పారు.

“ఒక వ్యక్తి తాను విన్న విషయాలను విన్నట్లే ఇతరులకు చెప్పడం, చెప్పే వ్యక్తిని (కాదిబ్) అబద్ధాలఖోరుగా అవటానికి సరిపడుతుంది.” (ముస్లిమ్ + అబూదావూద్)

మరోమారు తన ప్రవచనంలో అబూ హురైర (ర.అ) దైవప్రవక్త (సఅసం) గురించి ఇలా అన్నారు.

“ఒక వ్యక్తి పాపి (ముద్‌నిబ్) అవడానికి తాను విన్న అన్ని విషయాలూ బయటికి పొక్కించడంతో సరిపోతుంది.” (అల్ హాకిమ్)

మరికొన్ని సమయాల్లో ఇతరుల మాటలను నిర్ధారణ చేసుకోకుండానే “నేను విన్నది ఇదే. విన్నదాన్ని మాత్రమే ఇతరులతో అంటాను” అని అంటారు.

ఆయన విన్నమాటలు పరాయి వ్యక్తి దూషణయో లేక సచ్చరిత్ర కల వ్యక్తిపై అపనింద మోపటమో అయితే ఎలా? మరీ ఆ వ్యక్తి ఇంకా ఇలాంటి అపనిందలను చేస్తూపోతాడా? ఇలాంటి అపవాదులకు గురైన వ్యక్తిని గురించి మనలో ఎవ్వరు మాట్లాడటానికి యిష్టపడతారు?

(3) మూడవ అంశం : ఇతరులను నవ్వించడానికై అసత్యాలు పలకటం.

"ముఆవియహ్ బిన్ అబు సుఫ్యాన్ (ర.అ) దైవప్రవక్త (సఅసం) గారు ఇలా సెలవిచ్చారని అన్నారు.

"అతనికై సర్వనాశనం – ఎవరైతే ఇతరులను నవ్వించడానికై అబద్ధాలు చెబుతాడో. – సర్వనాశనం వానికే – సర్వనాశనం వానికే." (అత్ తిర్మిజీ)

దురదృష్టవశాత్తూ, ఇలా వ్యవహరించే పెక్కుమంది, ప్రజల 'ఆదరణకు' పాత్రులై లేక ధనవంతులై పోతారు. ప్రజల జీవితాలను సుఖసంతోషాలతో నింపేస్తామనే నటీనటులు (సినిమాల్లో, టీ.వి., వగైరా) పై కోవకు చెందినవారే. ప్రజలు ఈ నటీనటులను చూసి, వారి చేష్టలను మెచ్చుకుంటూ ఈ జీవన సాగరంలో తమకు కలిగే గ్లానీ, వేదనలకు ఆ మనోల్లాసమే 'మందు' అనుకొంటారు. ప్రజలలో ఎందుకూ కొరగాని కోరికలూ, వారి దురాశా, ప్రాపంచిక వ్యామోహాలూ పెరిగి వారి ఆలోచనలకు సమంజసత్వాన్ని చేకూరుస్తాయి.

## అసత్యం "కుఫ్ర్" (అవిశ్వాసత)కు ఒక గొప్ప రూపం

ఇబ్న్ కైయిమ్ అల్ జవ్జియ్యి ఇలాగన్నారు :

బ్రహ్మాండమైన అవిశ్వాసము (కుఫ్ర్) ఐదు రకాలు –

1). నిరాకరణ లేక అవిశ్వాసము (అల్లాహ్ (సు.త)ను నిరాకరించటం)

2). దైవం ముందు తలవంచటాన్ని నిరాకరించిన వ్యక్తి యొక్క గర్వము, దురహంకారాలు.

3). సత్యాన్ని చూడలేక ముఖం చాటు వేయడం.

4). ప్రతి 'వార్త'ను అనుమానించటం.

5). అవిశ్వాసం, కృతఘ్నుత.

**(1) మొదటి రకం కుఫ్ర్ :** దైవప్రవక్తలనూ (అలైహిమ్ అస్సలాతు వస్సలాము) 'ఆయత్'లనూ, నిజాన్నీ భువిలో ధృవీకరించడానికీ మరీ అవిశ్వాసులకు సాకులు చెప్పడానికి ఎలాంటి అవకాశం లేకుండా కావలసినన్ని (ఆయాత్‌లు) దైవనిదర్శనాలు, సాక్ష్యాలూ ఉన్నా విశ్వసించకపోవటం కుఫ్ర్‌కు నిదర్శనం. ఇలాంటి అవిశ్వాసం ఫిర్‌ఔన్ లాంటి కొద్దిమంది అవిశ్వాసుల్లో స్పష్టంగా కనిపిస్తుంది.

"వారు నిరాకరించారు (నిదర్శనాలను) తప్పిదంతో అహంకారంతో, వారి ఆత్మలకు నమ్మకం కుదిరిన తర్వాత కూడా." (27:14)

ఆయన (సు.త) తన ప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ఇలా సెలవిచ్చారు.

"వారు నిన్ను కాదు నిరాకరించేది, నిజానికి అల్లాహ్ (సు.త) యొక్క నిదర్శనాలను (గుర్తులను) మాత్రమే ఆ దుష్ట మానవులు నిరాకరిస్తున్నారు." (6:33)

దీన్ని 'అసత్యవాదన మిళితమైన కుఫ్ర్' అంటారు. ఎందుకంటే దైవనిరాకరణ నాలుక ద్వారా చేయబడినది.

**(2) రెండవ రకం కుఫ్ర్ :** అహంకారంతో కూడిన కుఫ్ర్ అనగా గర్వంతో అల్లాహ్ (సు.త) ముందు దాసోహం కాకపోవడం. ఇది ఇబ్‌లీస్ (షైతాన్) యొక్క అవిశ్వాసానికి సాటి. ఇబ్‌లీస్ (షైతాన్) గర్వం, దురహంకారాలతో నిండి ఉండి, అల్లాహ్ (సు.త) వారి ఆజ్ఞలను ధిక్కరించాడు కాని, శిరసావహించలేదు. రసూలుల్లాహ్ (సఅసం) గారి సందేశాలు అల్లాహ్ (సు.త) వద్ద నుండి పంపబడిన రుజు సందేశాలని తెలిసీ కూడా గర్వాహంకారంతో విర్రవీగి ధిక్కరించిన వారు కూడా ఇబ్‌లీస్ లాంటి వారు ఈ రెండవ రకం కుఫ్ర్‌కు చెందినవారు. మొత్తానికి నిశ్చయంగా

ఇలాంటి కుఫ్ర్ (అవిశ్వాసం) నెరపిన వాళ్ళు దైవప్రవక్తల శత్రువులే. ఫిర్‌ఔన్ మరియు అతని ప్రజలను గురించి అల్లాహ్ (సు.త) ఈ విధంగా అన్నారు:

"వాళ్ళు ఇలాగన్నారు : "మాలాగే ఉన్న ఆ యిద్దరు వ్యక్తులపై విశ్వాసం ఉంచాలా? వారి జాతివాళ్ళంతా మాకు బానిసలే. (వాళ్ళ మనుషులంతా మా వద్ద మా కనుసన్నలలో మెలగుతూ హీనమైన బ్రతుకు బ్రతుకుతున్నారు.) (23:47)

ఆయన (సు.త) దైవప్రవక్తలను ఆయా ప్రజలు ఏమన్నారో విశదీకరించాడు.

"వాళ్ళన్నారు : మీరు మా లాగే మనుషులు మాత్రమే కాని మరేమీ కారు." (14:10)

ఆయన (సు.త) మరీ సెలవిచ్చారు.

"తమూద్ అనే జాతివారు తమ మితిమీరిన ప్రవర్తనతో (వారివద్దకు వచ్చిన) దైవప్రవక్త (అ.స)ను తిరస్కరించారు." (91:11)

యెహూదియ్యుల ధిక్కారాన్ని (కుఫ్ర్) గురించి అల్లాహ్ (సు.త) ఇలా ప్రస్తావించారు.

"వారెరిగిన ఆ సత్యం వారి వద్దకు వచ్చినపుడు గుర్తుపట్టి కూడా, అవిశ్వాసం ప్రకటించారు." (2:89)

అల్లాహ్ (సు.త) ఇంకా ఇలా అన్నారు :

"వారు తమ పుత్రులను గుర్తించినట్లు ఆయనను గుర్తింపగలరు." (2:146)

**(3) మూడవ రకం కుఫ్ర్** : యథార్థాన్నించి మొఖం త్రిప్పి చాటేసుకోవటం. తమ హృదయాలను, తమ శ్రవణేంద్రియాలను

దైవప్రవక్తల (అ.స) ప్రవచనాలు వినకుండా మొఖాలు త్రిప్పేసుకొనేవారు ఈ కోవకు చెందినవారు. వాళ్ళు దైవప్రవక్త (సఅసం) పై విశ్వాసం చూపరు, మరీ ఆయన ప్రవచనాలను ససేమిరా వినరు. దీనికి ఉదాహరణ, ప్రవక్త (సఅసం) తో అబ్ద్ యఅలిల్ కొడుకు చెప్పిన ఉదంతం.

“అల్లాహ్ (సు.త) సాక్షిగా, నేనో విషయం మీకు చెప్తాను. మీరు సత్యసంధులైతే, మీతో సంవాదన చేయటానికి మీరు నా దృష్టిలో గొప్పవారు. మీరు అసత్యమాడుతున్నట్లైతే మీతో మాట్లాడటానికి మీరు నా దృష్టిలో తక్కువ వారు.”

ఈనాడు ముస్లిమ్ పేర్లు పెట్టుకొని యహూదీలను, క్రిష్టియన్‌లను అనుకరించే తమ మతాన్ని అనుసరించని సద్గుణవిహీనుల నమ్మకం అవిశ్వాసం (కుఫ్ర్) సరసనే చేరుతుంది. పైగా తాము ప్రయాణించే మార్గమే సంస్కృతికి, అభివృద్ధికి సోపానమని బల్లగుద్ది చెబుతారు వీరు.

**(4) నాలుగవ రకం కుఫ్ర్ :** (శంక) అంటే – అనుమానించటమే. ఈ రకం కుఫ్ర్‌కు అలవాటుపడ్డ వ్యక్తి ఎల్లప్పుడూ ఏ విషయాన్నీ విశ్వసించాలా వద్దా అనే మీమాంసలో పడి ఉంటాడు. అల్లాహ్ (సు.త) గారి దివ్య సంకేతాలను మరియు దివ్య ప్రవక్త గారి (సఅసం) జీవనాన్ని అధ్యయనం చేసి, అవలోకనం చేస్తే ఇలాంటి వ్యక్తుల ‘కుఫ్ర్’ పటాపంచలైపోతుంది. పగటివేళలో సూర్యుడెలా స్పష్టంగా గోచరిస్తాడో అలాగే అల్లాహ్ (సు.త) వారి దివ్య సంకేతాలు మరియు ప్రవక్త గారి (సఅసం) నీతి నిజాయితీ యదార్థానికి ప్రతీకగా కొట్టవచ్చినట్లు దిగ్గోచరమౌతాయి.

**(5) ఐదవ రకం కుఫ్ర్** : – కుచ్ఛితం – మనసులో యిలాంటి కుఫ్ర్ ఉన్న వ్యక్తి మాటవరసకైతే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తాడు. కాని అతని హృదయాంతరాళాల్లో అవిశ్వాసం నిండి ఉంటుంది. ఇలాంటి వ్యక్తినే 'కుచ్ఛితుడు' అంటారు.

అల్లాహ్ (సు.త.) మరియు ఆయన ప్రవక్త (సఅసం) లకు విరుద్ధంగా అసత్యం చెప్పటం

"పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.త)ను తన అబద్ధాలకు గురి చేసిన వ్యక్తుల వదనాలు కారు నలుపై పోవును." (39:60)

అల్ హసన్ నుడివిరి :

"మా యిష్టమైతే అలా చేస్తాం మేము. మా ఇష్టానుసారం అలా చేయము కూడా." అని అలాంటి వారే అంటారు.

ఇబ్న్ అల్ జవ్జీ తన "తఫ్సీర్"లో అల్లాహ్ (సు.త) మరియు ఆయన ప్రవక్త (సఅసం) గారిపై అబద్ధాలు చెప్పడం "కుఫ్ర్" (అవిశ్వాసం) అయి, అలా అనే వారిని ఇస్లాం మతం నుండి బయటికి గెంటివేస్తుందనే ఓ విద్వాంసుల అభిప్రాయాన్ని ఉటంకించారు. ఇందులో ఎలాంటి సందేహం లేదు – అల్లాహ్ (సు.త) మరియు ఆయన ప్రవక్త (సఅసం)ను అసత్యపరుస్తూ – అన్యాయమైనదానిని న్యాయమైనట్లుగా, మరియు న్యాయమైన దానిని అన్యాయంగానూ చేయటం కల్తీలేని కుఫ్ర్. ఇస్లాం నుండి వెలివేసే "కుఫ్ర్"లో అనుమానపు కుఫ్ర్‌కంటే చిన్న విషయాలు కూడా ఉన్నాయి.

దివ్య ప్రవక్త (సఅసం) గారు సెలవిచ్చారు :

"నాపై అబద్ధాలాడే వ్యక్తికై నరకాగ్నిలో ఒక ఇల్లు తయారు చేయబడుతుంది."

మరో హదీసులో ఇలా అన్నారు (సఅసం) :

“ఎవరైతే కావాలని నాకు అబద్ధాన్ని అంటగడతాడో అతను తప్పక నరకాగ్నిలో తన స్థానం పొందుతాడు.” (అల్ బుఖారీ + ముస్లిమ్)

“ఎవరైనా అసత్యమని తెలిసికూడా నాపై ఏదైనా అభాండం వేసి నాకు ఆపాదిస్తాడో, ఆ వ్యక్తి అసత్యవాదులలో ఒకడౌతాడు.” (ముస్లిమ్ + అత్ తిర్‌మిజి)

# సలఫ్ (రసూలు (సఅసం) గారి అనుయాయులు .... వగైరా) వారి నోటి ఆణిముత్యాలు

ప్రియమైన అన్నలారా, తమ్ముళ్ళారా, ‘అసత్యమే’ క్రూరత్వానికీ, చెడ్డపనులకూ మూలం – దైవప్రవక్త గారు (సఅసం) వాక్రుచ్చినట్లుగా :

“అసత్యం క్రూరత్వానికి, మరి క్రూరత్వం నరకాగ్నికి దారి చూపిస్తాయి.” (అల్ బుఖారీ + ముస్లిమ్)

అసత్యం యొక్క మొదటి మార్గము తన (ఆత్మ) హృదయం నుండి జిహ్వా వరకు చేరుతుంది. నాలుకను భ్రష్టం చేసేసి, శరీరంలోని అన్ని అవయవాలలోకీ ప్రాకిపోతుంది. అసత్యము వ్యక్తి యొక్క సంభాషణలనూ, చేష్టలనూ పాడుచేసి, మనిషిని సర్వనాశనం చేసేస్తుంది – అసత్యాన్ని సత్యసంధతతో తన ఆత్మలో నుండి పెళ్ళగించి పారవేయుటకు అల్లాహ్ (సు.త) సహాయం చేస్తే తప్ప సఫలీకృతం కానేరము.

హృదయ కార్యకలాపాలకు సత్యసంధతయే పునాది. దీనికి ప్రతిగా

అబద్ధం నుండి దురహంకారమూ, నటనా, ప్రదర్శనా, భీరత్వమూ, సోమరితనమూ, నిర్వీర్యతా, కాల్పనికతా మొదలైన దుర్గుణాలు వ్యక్తిలో చోటు చేసుకొంటాయి. అబద్ధాలఖోరును స్వలాభాలకూ మరియు ఫలప్రదమైన మంచిపనులకు దూరంగా ఉంచడానికై అల్లాహ్ (సు.త) పెక్కు అడ్డంకులను అతని దారిలో కల్పిస్తాడు. ఇక సత్యసంధుని విషయంలో అల్లాహ్ (సు.త) ఈ ప్రాపంచిక మరియు పరలోక జీవనాల్లో అతని స్వలాభాల మరీ, అవసరాల పరిపూర్తికై కావలసిన సహాయాన్నందిస్తూ అతనికి బాసటగా నిలుస్తాడు. ఇరు ప్రపంచాలలోనూ (ఈ దివిలోనూ మరి ఆ తరువాత పరలోకంలోనూ) మంచిని పొందటానికి నిజం లాంటిది మరొక్కటి లేదు – అలాగే చెడును, హానిని పొందటానికై అబద్ధానికి సాటి మరేదీ రెండు ప్రపంచాల్లోనూ లేదు.

"సలఫ్" (సచ్ఛీలురైన సహాబాలాంటి మన పూర్వీకులు) వారు ప్రవచించిన కొన్ని ఆణిముత్యాలు ఇలా ఉన్నాయి :

◆ అలీ (రజి) అన్నారు : అల్లాహ్ (సు.త) వద్ద అతి ఘోరమైన పాపం అబద్ధం చెప్పడమే. అతి నీచమైన పశ్చాత్తాపం పునరుత్థానదినమున పడే ఫలితంలేని ఆ పశ్చాత్తాపమే."

◆ మాలిక్ బిన్ దినార్ అన్నాడు "అతని భాషణలను అతని చేష్టలతో బేరీజు వేయబడని ధర్మబోధకుడెవరూ ఉండరని ఒక పుస్తకంలో చదివాను. ఒకవేళ అతను సత్యవంతుడైతే అతడు సత్యంపై నిలిచినట్లే లేక అతను అసత్యవంతుడైతే అతని పెదవులు అగ్నితో చేయబడిన కత్తెరతో కత్తిరించివేయబడును. అలా కత్తిరింపబడిన వెంటనే, యధాతథంగా కొత్త పెదవులు పుట్టుకొస్తాయి." (అంటే ఆ శిక్ష అసలు జరుగుతూనే ఉంటుంది).

◆ మాలిక్ బిన్ దినార్ అన్నారు : "సత్యమూ, అసత్యమూ

రెండింటిలో ఒకదానిని వెలుపలికి పారదోలే వరకు పరస్పరం ఆ రెండూ తలపడుతూనే ఉంటాయి."

◆ హారూన్ బిన్ ర'ఆబ్ అన్నాడు : "అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ చనిపోయే చివరి గడియల్లో ఇలా అన్నాడు : "నా కూతురిని లగ్నమాడడానికి వచ్చిన ఒక కురైష్ యువకుడికి నేను మాట ఇచ్చినంత పని చేశాను. అల్లాహ్‌తోడు, నేను 1/3 వంతు కుచ్చితంతో అల్లాహ్ (సు.త) ను కలవటానికి నాకు మనసు రావటం లేదు. అయ్యా! నువ్వు సాక్షిగా నిలబడు – నేను నా కూతురి వివాహం ఆ వ్యక్తితో చేసేశానని."

◆ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ – అల్ వాలిద్ బిన్ అబ్దుల్ మాలిక్‌తో దేన్నో గురించి మాట్లాడాడు. అల్ వాలిద్ "నీవు అసత్యం చెబుతున్నావని అన్నాడు. "అల్లాహ్‌పై ఒట్టు, అసత్యం చెప్పే వ్యక్తికి అవమానం కలుగుతుందని తెలిసినప్పటి నుండీ, అబద్ధాలాడటం మానేశాను" అని ఆయన బదులిచ్చాడు.

◆ యాజిద్ బిన్ మైసరహ్ అన్నాడు : "నీరు చెట్ల వ్రేళ్ళను సాగుచేసినట్లే అసత్యం ప్రతి చెడ్డనూ పెంపొందిస్తుంది."

◆ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ అన్నాడు : "నేను "ఇజార్" వేయటం నేర్చుకొన్నప్పటినుండీ (అనగా బాల్యం నుండీ – 'ఇజార్' క్రింది దుస్తుల్లో ఒకటి) నేను అసత్య భాషచేయలేను.

## అసత్యానికి విరుగుడు

ముస్లింలారా! మీరు అసత్యం యొక్క వినాశరూపం చూడాలంటే మీకు అసహ్యాన్నీ దుఃఖాన్నీ కల్గించే అబద్ధాలు చెప్పే ఆ వ్యక్తులను చూడండి. ముస్లిములు తప్పులు చేసిన వెంటనే అల్లాహ్ (సు.త.)

సముఖంలో 'తౌబ' (పాపాలకు క్షమాభిక్ష) చేసుకోవాలి. ఇలా ముస్లిములు తమ శాయశక్తులతో పోరాటం చెయ్యాలి 'అసత్యాన్ని' తమ నుండి దూరం చేయటానికి."

అందులో భాగంగా యీ క్రింది సలహాలు ....

1. అన్నివేళలా అన్నిచోట్లా అసత్యం నిషిద్ధమని అబద్ధాలు చెప్పేవారికి కఠిన శిక్షలు తయారుగా ఉన్నాయని గుర్తుంచుకోండి.

2. క్లిష్ట పరిస్థితుల్లోనూ, ఆవేదనకు గురయ్యే వేళల్లోనూ తన విద్యుక్త ధర్మాలను నిర్వహిస్తూ నిజాన్ని చాటిచెప్పడాన్ని అలవాటుగా చేసుకోండి.

3. జిహ్వాను పరిరక్షించుకోండి – తనను తాను ప్రశ్నించుకోండి (సమంజసమా కాదా అని).

4. అబద్ధాలు ఏకరువుపెట్టబడే పనికిమాలిన సంభాషణలు జరిగే సమావేశాలకు బదులుగా – జ్ఞానాన్ని యినుమడింపజేసే మరియు (జిక్ర్) అల్లాహ్ (సు.త) స్మరణకై ప్రజలను పోగు చేయండి.

5. అసత్యవాదిలో కుచ్చితార్థ గుణాలు ఉంటాయని తెలుసుకోవటం.

6. అసత్యం – క్రూరత్వం మరియు చెడు కార్యాలకు దారి అని మరియు సత్యసంధత స్వర్గానికి తీసుకుపోతుందని తెలుసుకొని ఆ నిజాన్ని మనసులో పదిలపరచుకోండి.

7. మీ పిల్లలను ఇస్లామీయ నీతుల ప్రకారం పెంచండి, వాళ్ళకో సజీవ ఉదాహరణగా నిలబడండి.

8. ఒక అబద్ధాలకోరు, ముస్లిములకు, ముస్లిమ్ సమాజానికి గొప్ప హాని చెయ్యగలడని మీరు తెలుసుకొని జాగరూకులై ఉండండి.

అల్లాహ్ వారి శాంతి, వారి కరుణామృత దీవెనలు దైవప్రవక్త

(సఅసం) వారిపై, వారి గృహస్తులపై మరియు వారి అనుచరులపై సదా ప్రసరించుగాక! (ఆమీన్ యా రబ్బుల్ ఆలమీన్)



**Note :** All good things are from ALLAH (S.T.). All errors/mistakes in this Book belong to Abdullah. You are requested to notify such short comings to him without any hesitation.

JEALOUSY (Telugu)

# ఈర్ష్య (అల్ హసద్)

సంకలనం :

**అబ్దుల్లాహ్ జుల్ఫిఖార్ అలీ**

ప్రకాశకులు :

క్వెస్ట్ ఫర్ ట్రూత్ అండ్ అటైన్‌మెంట్

# 17-1-375/ఇ/35/14/1,

ఖుర్షీద్ జాహి మస్జిద్ ప్రక్కన, సంతోష్‌నగర్,

సఈదాబాద్, హైదరాబాద్ - 500 059

Cell : 9247191301

*బిస్మిల్లాహ్ హిర్రహ్మా నిర్రహీం*

*అమిత దయాళు అపార కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో*

సర్వ స్తోత్రాలు అన్ని ప్రపంచాలకూ ప్రభువైన అల్లాహ్‌కే (సుబహానహు వ తఆలా). శాంతి మరియు ఆశీర్వాదాలు సర్వప్రవక్తలలో మరియు సందేశహరులలో అత్యుత్తమ గౌరవనీయులైన ఆ ప్రవక్తపై (ఉండుగాక).

# ముందుమాట

దైవప్రవక్త (సఅసం) ప్రవచనాన్ని జుబైర్ (ర.అ) ఇలా ఉల్లేఖించారు : "గత సమాజాల అసూయా ద్వేషాల వ్యాధి" మీ వైపుకు నడచివస్తోంది. ఇది పూర్తిగా తుడిచివేసి, గొరిగివేసే వ్యాధి – అంటే వెంట్రుకలను కాదు – ధర్మాన్ని పూర్తిగా తుడిచిపెట్టే వ్యాధి – అని. (అహ్మద్, తిర్మిదీ)

భవిష్యత్తులో ముస్లిమ్ సమాజంలో కూడా అసూయా ద్వేషాలు మహమ్మారి రోగాలుగా రూపుదిద్దుకుంటాయని సఅసం వారు 'ఉమ్మ'ను అప్రమత్తం చేశారు – ఈ రోగం ద్వారానే పూర్వజాతులు / తరాలు సర్వనాశనం అయిపోయారని ముస్లిమ్‌లను హెచ్చరించారు.

ఆ ఈర్ష్యాపరుడు పరుల సంతోషాలను సహించలేడు. ఏదోవిధంగా వారికి నష్టం వాటిల్లాలని, వారి గౌరవమర్యాదలు మట్టిపాలు కావాలని మనసారా కోరుకుంటాడు – ఏమీ చేయలేక వారిపై కల్పితాలు / చాడీలు చెప్పుకుంటూ సంతృప్తి చెందుతాడు – ప్రళయదినాన తన అసూయ ఫలితంగా తన సత్కార్య ఫలితాలను – అసూయాగ్రస్తునికి అప్పగించుకుంటాడు – మరియు స్వహృదయ ప్రక్షాళన చేసుకొనేవరకూ అసూయాపరుడు అల్లాహ్ (సు.త) క్షమాభిక్షకు మరియు ఆయన (సు.త) కారుణ్యానికి అర్హుడు కాలేడు – అందువలన ముస్లిమ్‌లు తాము ఈ రోగానికి దూరంగా ఉండటం అత్యవసరమని తెలుసుకొని జాగరూకులై ఉండాలి.

**– ప్రచురణకర్త**

# హసద్ (ఈర్ష్య)

## హసద్ (ఈర్ష్య) అనగా ఏమిటి?

హసద్ (ఈర్ష్య) అనగా ఇతర వ్యక్తికై దైవం ప్రసాదించిన ప్రాపంచికమైన లేక మతపరమైన ధన, ప్రాణ, తదితర వరప్రసాదాలను అతనికి కలగకుండా నిలిపివేయాలనో లేక మొత్తం నాశనమై పోవాలనో కోరుకోవడమే. హసద్ (అసూయ) విశ్వాసాన్ని పాడుచేసే, నిందార్హమైన, నీచమైన ప్రవర్తన. హసద్‌లో అపకారంతో పాటు హద్దు మీరిపోవటం గమనించదగ్గ విషయం. ఈ కారణాలవలన అల్లాహ్ (సు.త) మరియు ఆయన ప్రవక్త (సఅసం) ఈ కార్యాన్ని నిషేధించారు. అల్లాహ్ (సు.త) ఇలా సెలవిచ్చారు: "విశ్వాసులైన పురుషులకు మరియు స్త్రీలకు అకారణంగా ఎవరైతే కష్టం కలిగిస్తారో, వారు తమపై ఆ అపనిందా నేర భారాన్ని మరియు పాపాన్ని వేసుకుంటారు."

ఈర్ష్య (హసద్) పడే వ్యక్తులను వారి కార్యకలాపాలను అల్లాహ్ (సు.త) ఈ విధంగా ఖండించారు :

"లేక వారు ఈర్ష్యపడతారా వ్యక్తులపై (ముహమ్మద్ – సఅసం) మరియు ఆయన అనుయాయులపై అల్లాహ్ (సు.త) వారి కొసంగిన ప్రసాదాలకై." అల్లాహ్ (సు.త) మనను ఆజ్ఞాపిస్తున్నారు : 'ఒక ఈర్ష్యాపరుని (హాసిద్) నుండి ఉత్పన్నమయ్యే కీడు నుంచి రక్షింపబడటానికి తన (సు.త) శరణుకోరమని."

"(నా శరణు కోరుకో) ఈర్ష్యాలోలుని కీడునుండి – అతడెప్పుడు అసూయపడితే."

అల్లాహ్ (సు.త) వారి ప్రవక్త (సఅసం) అసూయ, దాని పర్యవసానాలను గురించి ఈ విధంగా హెచ్చరించారు.

"ఈర్ష్యను విడనాడు, ఎందుకంటే అగ్ని కట్టెను (లేక గ్రాసాన్ని) కాల్చి నాశనం చేసేవిధంగా అసూయ సద్గుణాలను కాల్చి బుగ్గి చేసేస్తుంది." (అబూదావూద్)

దివ్య ప్రవక్త (సఅసం) మరీ యిలా అన్నారు :

"అల్లాహ్ (సు.త) వారి ప్రసాదాలకు శత్రువులున్నారు" : వారు అడిగారు : "వారెవ్వరు?" ఆయన (సఅసం) సెలవిచ్చారు : "ఎవరైతే అల్లాహ్ (సు.త) ఖజానాలలో నుండి ప్రసాదింపబడిన వారిపై అసూయ చూపిస్తారో." (అత్‌తబరానీ)

అందువలన ముస్లిమ్ సమాజ పారిశుద్ధత మరియు శాంతుల పరిరక్షణకై దైవప్రవక్త (సఅసం) అవి కల్లోలాకు గురికాకుండా ఈర్ష్యను నిషేధించారు.

ఆయన (సఅసం) అన్నారు :

"పరస్పరం ఏవగించుకోకండి. ఒకరినొకరు ఈర్ష్య పడకండి. ఒకరు మరొకరిని విడనాడకండి, ఒకరికి మరొకరితో గల సంబంధ బాంధవ్యాలను త్రెంచకండి. మరి ఓ అల్లాహ్ (సు.త) వారి బానిసలారా! అన్నతమ్ముళ్ళుగా మసలుకోండి. వినండి! ఒక ముస్లిమ్ తమ్ముడు మరో ముస్లిమ్‌ను మూడు రోజుల కంటే ఎక్కువ కాలానికి విడనాడకూడదు." (అల్ బుఖారీ + ముస్లిమ్)

## ఈర్ష్య యధార్థత మరియు దానికై నియమావళి:

ఇతర వ్యక్తుల వద్ద వున్న అల్లాహ్ (సు.త) గారి ప్రసాదాలను చూసి అసూయతో నిండిపోవటం నిజంగా ఒక అగాధ శోకం. అల్లాహ్

(సు.త) నీ తమ్మునికై వరప్రసాదాలిస్తే, అతని పట్ల ఈర్ష్య పడటానికి కారణం, ఈ రెండు కారణాలలో ఏదో ఒక్కటై ఉంటుంది :

1. ఆ ప్రసాదాన్ని ద్వేషించి అది ఆ తమ్ముడి చేజారిపోతే బాగుంటుందని కోరుకోవడం. ఈ ఉదాహరణలోని ఈ గుణాన్నే (హసద్) ఈర్ష్య అంటారు. మరియు దైవ ప్రసాదానికై తీవ్ర ద్వేషమూ, మరి అట్టి ప్రసాద గ్రహీతను ప్రసాద విహీనుడు కావాలనే దురాకాంక్ష ఈర్ష్యాపరుడిలో ఉండటం.

2. ఇతరులకు ప్రసాదాల నిలుపుదలను కోరుకోకుండా మరియు వారికి దొరికిన వాటిపై ఎలాంటి ద్వేషం లేకుండా ఆ ప్రసాదాన్నే తనకూ కావాలని కోరుకోవటం. ఇలాంటి అసూయని "గిత్‌బహ్" అంటారు. ఇది ఒక పోటీ లాంటిది. మొదటి రకం ఈర్ష్య నిషిద్ధం (హరామ్) అని తెలిపబడింది. కాని ఒక ముస్లిమేతర వ్యక్తి లేక క్రూరుడు తనకు కలిగిన దైవప్రసాదాన్ని ప్రజలకు కీడు ఒనగూడేట్లు లేక ప్రజల మధ్యగల సత్సంబంధాలను పాడు చేయటానికై లేక సమాజంలో చెడునూ, కుతంత్రాలనూ ప్రచారం చేయటానికై ఉపయోగిస్తే అట్టివారిపై ఈర్ష్య అనేది నిషేధం కానేరదు. ఈ ఉదాహరణలతో "దైవప్రసాదం"పై ఎలాంటి ద్వేషం లేదు, కాని ద్వేషమంతా దాన్ని కుతంత్రాలకై ఉపయోగించటంపైన మాత్రమే. లేకపోతే ఆ ప్రసాదం నాశనం కావాలని లేక ప్రసాదం పొందిన వ్యక్తిని ద్వేషించాలని కానీ ఏ వ్యక్తీ అభిలషించకూడదు.

సామాన్యంగా ఈర్ష్య (హసద్), ఇంతకుముందు ఉదాహరింపబడిన ఆయతుల, ఆ హాదీసుల బలంపై నిషిద్ధం (హరామ్) చేయబడింది. అల్లాహ్ (సు.త) వారు తన "కద్‌ర్" (అపార శక్తి) తో కొందరికి, మరికొందరికంటే హెచ్చుగా ప్రసాదించటానికి అభ్యంతరం తెలపటమే

ఔతుంది. ఈ ద్వేషభావము యొక్క ఉద్దేశ్యము, అల్లాహ్ (సు.త) వారు ఎవ్వరెవరిని ఎలా ఆదరించారో అనే విషయంలో సలహా ఇవ్వటం లేక అభ్యంతరం చేయడం మాత్రమే. ఆ హక్కు ఎవ్వరికీ లేదు. ఒక ముస్లిమ్‌కు ఏదో కానుక 'ఇవ్వబడినప్పుడు తనకెలాంటి హాని వాటిల్లనివేళ, ఆ ముస్లిమ్‌కు దొరికిన 'కానుక'ను ద్వేషించటం కంటే గొప్ప పాపం మరొకటి ఉందా? ఈ విషయంలో అల్లాహ్ (సు.త) ఇలా సెలవిచ్చారు :

"నీకు మంచి జరిగితే, అది వారికి దుఃఖదాయిని. కాని నిన్ను ఏదైనా హాని క్రమ్ముకొన్నట్లైతే వారు చాలా సంతోషపడతారు." (3:120)

ఈలాంటి అసూయ (హసద్) ఇతరులకు హానికరమైనది. ఇతరులకు హాని కలిగించాలనే ఆకాంక్ష, అసూయను పెనవేసుకొని వుంటుంది.

కోప ప్రభావం వలన ఉత్పన్నమయ్యేవి – ఏహ్యాభావం మరియు అసూయ. ఎప్పుడు కోపాన్ని వెలిబుచ్చలేక వ్యక్తులు దాన్ని అణిచివేస్తారో, అప్పుడది మనుషుల అంతరాళాల్లోకి చొరబడి, నిండిపోయి పరిపూర్ణ ఈర్ష్యగా రూపాంతరం చెందుతుంది. అలాంటి హృదయం తన ఏహ్యాభావంతో యితరులంటేనే ద్వేషంతో స్పందిస్తోంది. మరీ వారికి ఒసగబడే కానుకలకు అడ్డుకట్ట కట్టాలని కోరుకుంటుంది. ఇతరులకు కలిగే కష్టాలకు, ఈతిబాధలకు ప్రతిగా ఈర్ష్యా, ఏహ్య భావాలతో తాను సంబరపడుతుంది. అప్పుడు నీవు ఆ వ్యక్తిని ఆహ్వానించకుండా దూరంగా నెట్టివేసి, అతనితో మాట్లాడవు కూడా. నీ పదునైన నాలుకతో హక్కులకు విపరీతంగా అన్యాయమైన పద్ధతితో అతని గురించి చెడ్డగా ప్రచారం చేస్తావు – అతనిని పరిహసించటానికో, లేక హాని కలిగించటానికో – లేక జులుం నుండి తనను తాను రక్షించుకొనేంతటి హక్కును అతనికి లేకుండా చేయాలనో – ఈ పనులన్నీ అతి ఘోరమైన అపరాధాలు, మరియు నిషిద్ధాలు (హరామ్).

## కుఫ్ర్ (అవిశ్వాసానికి) ఊతలు నాలుగు :

1. ధిక్కారం 2. ఈర్ష్య 3. కోపం 4. వ్యర్థ కోరికలు

నిజాన్ని అనుసరింపకుండా వెనక్కి గుంజుతుంది ధిక్కారం. ఇతరుల సలహాలను తీసుకోనివ్వకుండా మరియు ఇతరులకు సలహాలను ఇవ్వకుండా ఆపుతుంది ఈర్ష్య. న్యాయ సంస్థాపనకాకుండా అడ్డుపడుతుంది కోపం. భక్తి, ఆరాధనల నుండి దూరంగా ఉంచుతాయి వ్యర్థమైన కోరికలు. 'ధిక్కారపు' ఊతను తీసిపారేస్తే నిజాన్ని అమలు చేయటం సులభతరం ఔతుంది. 'ఈర్ష్య' అనే ఊతను నాశనం చేసేస్తే సలహాలు ఇచ్చి పుచ్చుకోవటం సరళమౌతుంది. 'కోపం' అనే ఊడను పీకేస్తే న్యాయంగా, సౌమ్యంగా ఉండటానికి దోహదకారి ఔతుంది. ఇక 'వ్యర్థమైన కోరికల' ఊతను పెకలించివేస్తే ఓపిక మరియు రుజు ప్రవర్తనలు సులభతరం ఔతాయి. ఈ నాలుగు దుర్గుణాలకు మూలకారణం – ఓ వ్యక్తికి తన ప్రభువు (సు.త)ను గురించి మరీ తనను గురించి సరియైన అవగాహన లేకపోవటమే.

ఆ వ్యక్తి గనుక తన ప్రభువును (సు.త) అతని (సు.త) గొప్పతనాన్నీ, ఆయన లక్షణాలనూ తెలుసుకొని మరియు తనలోని లోటుపాట్లనూ, చెడ్డగుణాలనూ గుర్తుచేసుకొంటే – తన అవసరాల పరిపూర్తికి – ఎలాంటి ధిక్కారాన్ని, కోపాన్ని ప్రదర్శింపటానికి భయపడతాడు. తత్ఫలితంగా అల్లాహ్ (సు.త) ఇతరులకు ప్రసాదించిన కానుకలను చూసి అసూయచెందడు.

యదార్థంగా ఈర్ష్య అనే దుర్గుణం, అల్లాహ్ (సు.త)తో వైరుధ్యాన్ని తెచ్చి పెట్టుకోవటమే. అల్లాహ్ (సు.త) తన యిష్టానుసారం ఇతరులకు ఇచ్చినదానిని (కానుక / ప్రసాదం) ఈ ఈర్ష్యాపరుడు ఏహ్యాపడుతున్నాడు.

ఇలాంటి వ్యక్తి అల్లాహ్ (సు.త) వారిని, వారి (సు.త) "నిర్ణయాన్ని" ఇష్టాయిష్టాలనూ ప్రతిఘటిస్తున్నాడు. (హాసిద్) ఈర్ష్యాపరుడు, అల్లాహ్ (సు.త) అనుగ్రహం పొందిన వ్యక్తి నుండి 'ప్రసాదాలు' దూరం కావాలని కోరుకుంటున్నాడు కూడా. ఈ రకంగా షైతాను (ఇబ్‌లిస్) అల్లాహ్ (సు.త)వారికై నిశ్చయ శత్రువైనాడు. ఇబ్‌లీస్ (షైతాను) కూడా తన ఈర్ష్యా, ధిక్కారాలతోనే ఆ పాపానికి ఒడిగట్టాడు. ఈ రెండు చెడుగుణాలను వ్రేళ్ళతో సహా పెకలించివేయాలంటే – దాసుడు అల్లాహ్ (సు.త) వారి "ఏకత్వాన్ని" పరమ సత్యంగా గ్రహించి, తగిన జ్ఞానసముపార్జన చేసుకొని, దైవనిర్ణయాలను శిరసావహిస్తూ, తన పాపాలకై పశ్చాత్తాపం చేసుకోవాలి. ఓ విజ్ఞాని ఇలా అన్నాడు : "ఈర్ష్యాపరుడు ఐదు విషయాల్లో అల్లాహ్ (సు.త) తో పోటీపడుతున్నాడు. మొదటిది అల్లాహ్ (సు.త) ఒక వ్యక్తికి ప్రసాదించిన కానుకను అసహ్యించటం. రెండవది తనకు అల్లాహ్ (సు.త) ప్రసాదించిన వస్తువులపై అసంతుష్టుడై ఉండటం. ఇది అల్లాహ్ (సు.త) తో, "నువ్వు ప్రజలకు ఈవిధంగా ఎందుకు ప్రసాదించావు?" అని ప్రశ్నించటంలాగా ఉంది. మూడవది, అల్లాహ్ (సు.త) ధారాళంగా ప్రసాదించిన కానుకల విషయంలో ఇతరులకు ఇవ్వకుండా పిసినారితనాన్ని ప్రదర్శించటం. ఎందుకంటే అల్లాహ్ (సు.త) వారి అభీష్టం ప్రకారం వారి కనికరం వలననే ప్రజలకు కానుకలు ఇవ్వబడతాయి. నాలుగవది ఈర్ష్యాపరుడు అల్లాహ్ (సు.త) వారి స్నేహితులకు, బానిసలకూ కానుకలు దూరం కావాలని కోరుకుంటూ వారినుండి దూరమైపోతాడు. ఐదవది, ఈర్ష్యాపరుడు అల్లాహ్ (సు.త) వారికి బద్ధ శత్రువైన ఇబ్‌లీస్ (షైతాన్)ను సమర్థించడం."

మరీ ఇలా ప్రస్ఫుటం చేయబడింది :

"ఈర్ష్యాపరునికి ప్రజల నుండి పరుషపదాలు, అవమానంతో పాటు,

దైవదూతల నుండి శాపనార్థాలు, తప్ప మరేమీ ఒనగూడవు. మరణకాలంలో అతను అమిత శత్రుత్వానికీ, క్రూరత్వానికినీ బలికావాల్సివస్తుంది. తీర్పుదినాన అతనిని హేయమైన అవమానాలతో బాటు అత్యంత కఠిన శిక్షలకు గురౌతాడు. ఆఖరున అన్నింటికీ మించిన నరకాన్నీ, దాని వేడినీ, కాల్పులనూ ఓపికగా భరించాల్సి ఉంటుంది."

## పోటీ

ప్రతి గుణానికీ, ప్రతి నీతి నియమానికీ ఒక హద్దు ఉంది. హద్దు మీరితే అది పాపం ఔతుంది. విద్యుక్త ధర్మాల నిర్వర్తనలో చేయవలసిన దానికంటే తక్కువ చేస్తే అది ఓ లోపం, మరీ అజాగ్రత్త ఔతుంది. ఈర్ష్యకు ఓ హద్దున్నది – పరిపూర్ణతకై ఆరాటపడటం – ఇతరులకంటే వెనకపడ్డాననే ఏడుపు, ఇతరులకు కానుకలు కాకుండా పోవాలని, వారికి చెడు కలగాలనే తీవ్ర కోరికలవలన వ్యక్తి యొక్క అనర్హత, అతని కార్యశీలతా లోపానికి నిదర్శనం. ఇస్‌లామ్‌లో పోటీపడటం నిషేధం కాదు. అల్లాహ్ (సు.త) సెలవిచ్చారు :

"మరి దీనికోసం అందరినీ శ్రమపడనీ (పోటీపడి, తొందరగా) ఎవరైతే శ్రమపడాలని కోరుకుంటారో." (83 : 26)

ఆయన (సు.త) అన్నారు :

"ఓ ప్రవక్తా! మరి మేము (సు.త) పంపించాము నీ వద్దకు ఈ గ్రంథాన్ని (కుర్‌ఆన్) సత్యంతో, అంతకు మునుపు వచ్చిన దైవగ్రంథాలను ధృవీకరిస్తూ, మరియు దానిపై ముహైమిన్‌గా (గొప్పతనంతో నమ్మదగినవిగా, మరియు సాక్షులుగా). మరి వారిపై న్యాయ నిర్ణయాన్ని అల్లాహ్ నీకు వివరించిన పద్ధతిలో చెయ్యి. నీ వద్దకు చేరిన జ్ఞానానికి

అతీతంగా వారి వ్యర్థ కోరికలను అనుసరింపకు. మీలో ప్రతి ఒక్కరికీ మేము (సు.త) ఒక న్యాయ వ్యవస్థనూ మరియు ధర్మమార్గాన్నీ సుస్పష్టం చేశాము. అల్లాహ్ (సు.త) అనుకుంటే మీ అందరినీ ఒకే అనుయాయకూటమిగా చేసేవాడు. కాని ఆయన (సు.త) మీకిచ్చిన కానుకలతో మిమ్మల్ని పరీక్షించటానికే (అలా చేయలేదు) కావున సత్కార్యాలకై పోటీపడండి. మీ అందరి తిరుగు ప్రయాణం అల్లాహ్ (సు.త) దగ్గరికే. అప్పుడు ఆయన (సు.త) మీరు అభిప్రాయభేదాలతో సతమతమయ్యే ఆ విషయాలపై తన (సు.త) నిర్ణయాన్ని మీకు విశదీకరిస్తారు." (సూరతుల్ మఅయిదహ్ 5 : 48)

మరీ వారు (సు.త) ఇలా అన్నారు :

"పరుగెత్తండి – వేగురపాటుతో – క్షమాభిక్షపొందటానికై మీ ప్రభువు నుండి." (57:21)

బుఖారీ మరియు ముస్‌లిమ్ యిరువురూ విశదీకరించిన ఒక హదీసులో దైవప్రవక్తగారు (సఅసం) ఇలాగన్నారు :

"ఈ రెండింటిలో పోటీ పడటంలో హస్‌ద్ (ఈర్ష్య) లేదు. ఒక వ్యక్తి తనకు అల్లాహ్ (సు.త) చే యివ్వబడిన ఐశ్వర్యాన్ని పగటి వేళల్లోనూ, రాత్రి ఘడియల్లోనూ ఖర్చుపెడుతూనే ఉంటాడు. మరొకవ్యక్తి అతనికి అల్లాహ్ (సు.త) ఇచ్చిన "కుర్‌ఆన్" (యొక్క జ్ఞానసంపత్తి)ను రాత్రివేళల్లోనూ, పగటి ఘడియల్లోనూ (కుర్‌ఆన్) పారాయణం చేస్తూ అల్లాహ్ (సు.త)ను ఆరాధిస్తూ, స్తుతిస్తూ నిలబడతాడు."

ఇలాంటి ఈర్ష్యను **"గిత్‌బహ్"** అంటారు. దీన్లో తనకు ఇతరుల లాగా అలాంటి ప్రసాదమే కావాలనుకోవటం వుంటుంది. కాని ఇతరులకు యివ్వబడిన కానుకల వారిచేజారి పోవాలనే ఈర్ష్యా తపన ఉండదు.

అబూ కస్‌బహ్, అల్ అన్‌మఆరీ చెప్పిన ఈ హదీసులో రసూలుల్లాహ్ (సఅసం) యిలా వివరించారు:

“ఈ ఉమ్మ (ముస్లిం సమాజం) ప్రజలు ఆ నలుగురు వ్యక్తులలాగా ఉన్నారు – ఒకరికి అల్లాహ్ (సు.త) సిరిసంపదలతో పాటు జ్ఞానాన్ని ప్రసాదించాడు. మరి అతను తన జ్ఞానం సహాయంతో తన సిరిసంపదలనూ ఉపయోగిస్తాడు. 2. మరొక వ్యక్తికి అల్లాహ్ (సు.త) ధనం కాకుండా, జ్ఞానాన్ని మాత్రమే ప్రసాదించాడు. ఆ వ్యక్తి యిలా అంటాడు : “ఓ ప్రభూ! నాకు ఫలాని వ్యక్తి లాగే ధనరాసులుంటే నేనూ అతనిలాగానే ఖర్చుపెట్టేవాడిని.” పై ఇద్దరి వ్యక్తులకు అల్లాహ్ (సు.త) ఒకే రకమైన పుణ్యాలు యిస్తారు. ఇలాంటి (రెండవ) వ్యక్తి ఇతరులలాగా తనకూ ధనరాశులు కావాలని కోరుకుంటాడు. కానీ ఇతరులకున్న సిరిసంపదలు మటుమాయమైపోవాలని కోరుకోడు. 3. మరో వ్యక్తికి అల్లాహ్ (సు.త) జ్ఞానం ఇవ్వకుండా ఐశ్వర్యాన్ని మాత్రమే ప్రసాదిస్తాడు. మరి అతడు తన ఐశ్వర్యరాసులను దైవధిక్కారానికై వినియోగిస్తాడు. 4. ఆఖరివాడు – అతనికి అల్లాహ్ (సు.త) జ్ఞానమూ, సంపదా రెండింటిలో ఏదీ యివ్వలేదు.” “నాకూ ఫలానా వ్యక్తిలాగా సంపద కలిగితే నేనూ అతనిలానే ఖర్చు చేస్తానని” చివరి వ్యక్తి అంటాడు. ఈ యిరువురికీ (3 మరియు 4వ వ్యక్తులకు) ఒకేరకమైన పాపం కలుగుతుంది. దైవప్రవక్త (సఅసం) యిలాంటి వ్యక్తి సంపదలను కోరుకున్నాడని కాదు గాని, పాపభూయిష్టమైన అతని రెండవ కోరికకై – తీవ్రంగా ఖండించారు. గిత్‌బహ్ లాంటి ఈర్ష్యను కలిగి ఉండటం హానికరం కాదు – ఎందుకంటే ఇతరులకు కల్గిన ఐశ్వర్యాలను వారికి దూరం కావాలని కోరుకోకుండా – తనకూ అలాంటి సంపదే కలగాలని కోరుకోవడం.”

ఒకవేళ కోరుకొనే కానుక (సంపద) ఇస్‌లామ్‌కు సంబంధించిన ఈమాన్, సలాహ్ లేక జకాహ్ లాంటి మత విధులకు సంబంధినదైతే, అట్టి పరిస్థితుల్లో ఆ పోటీ దైవం మనపై విధించిన విద్యుక్తధర్మాలలోని కోవకు చెందినదైపోతుంది." (అనగా ఖండింపబడదు). ఆ కానుక ఒక సత్యసంధతకు దారితీసే పనైతే దానం చేయటం లాంటిదేనని కొనియాడబడుతుంది. మరీ ఆ పనిలో పోటీ పడటం చాల ఉత్కృష్టమైన చర్య. దైవాధీనంలో దైవపరిధిలో ఉపయోగపడే ప్రతి కానుక విషయంలోనూ పోటీ పడటం సబబే.

## ఈర్ష్యకు కారణాలు

### 1. శత్రుత్వం మరియు ఏహ్యత

ఎప్పుడైనా ఒక వ్యక్తికి హాని కలిగితే లేక అతని బాగోగులకు వ్యతిరేకంగా ఎవరైనా పనిచేస్తే మొదటి వ్యక్తి రెండో వ్యక్తిని ద్వేషిస్తాడు. అంటే అతని మనసులో కల్మషం ఉంటుంది, ఆ రెండో వ్యక్తి కష్టాలనుభవిస్తుంటే, అతనికి సరియైన శాస్తి జరిగిందని అల్లాహ్ (సు.త) అతని కుతంత్రాలకు ఫలంగా ఆ కష్టాలను కలిగించాడని మొదటి వ్యక్తి అనుకొంటూ సంబరపడతాడు. మరెప్పుడైనా అతనికి దైవం కానుకలను /ప్రసాదాలనూ బహూకరిస్తే మాత్రం తాను శోకతప్తుడైపోతాడు, మొదటి వ్యక్తి. ఈవిధంగా ఈర్ష్య అనేది శత్రుత్వాన్నీ మరియు ఏహ్యాభావాన్నీ సృష్టిస్తుంది. ఎప్పుడైతే నీవు మరో వ్యక్తిని అసహ్యించుకొంటావో అతడు మంచి పరిస్థితుల్లో / లేక విపరీతపరిస్థితుల్లో ఉన్నాడా అనే దాన్ని గురించి నీవు లెక్క (ఖాతరు) చేయవు.

### 2. అహంకారం మరియు ద్రోహబుద్ధి

దీనికో మంచి ఉదాహరణ : ఒక వ్యక్తి ఐశ్వర్యాన్ని పొందుతాడు

లేక ఒక ఉన్నతమైన స్థానాన్ని చేరుకోగలుగుతాడు. కాని మరో వ్యక్తి తన కంటే ఎక్కువ ధనరాశులను పొందుతాడనో లేక స్థానపరంగా తనను తలతన్నేస్తాడేమోనని అతనిని అసహ్యించుకొంటాడు. అలా అతను రెండవ వ్యక్తి అంటే ఈర్ష్య పడతాడు. అతను తన అహంకారం ఎక్కువై రెండో వ్యక్తిని తనతో సమానుడై పోవటాన్ని సహించలేకపోయే దుస్థితికి చేరుకుంటాడు. ప్రవక్త (సఅసం) గారంటే అలనాటి అవిశ్వాసులకు కలిగిన 'ఈర్ష్య' యీ కోవకు చెందినదని అల్లాహ్ (సు.త) ఈ ఆయత్ (కుర్ఆన్ వాక్యం) ద్వారా స్పష్టం చేసాడు.

"మరి వారు అంటారు : ఎందుకు కుర్ఆన్ ఆ రెండు పట్టణాలలో ఉన్న ఏ గొప్ప వ్యక్తికో పంపబడలేదు." (43 : 31)

విశ్వాసుల గురించి అదేవిధంగా అభిప్రాయపడ్డారు :

"అల్లాహ్ (సు.త) అనుగ్రహానికి పాత్రులై మన మధ్యలో (నివసిస్తూ) వున్నవాళ్ళు వీరేనా?" (6:53)

మరో 'ఆయ' (కుర్ఆన్ వాక్యం) ఇలా అంటున్నది :

"మీరు మానవమాత్రులు మాత్రమే మాలాగే" సూరతుల్ ముఅమినూన్‌లో ఇలా ఉంది :

"ఎప్పుడు మీరు మీలో ఒకరైన ఒక మనిషి ఆజ్ఞలను శిరసావహిస్తారో, నిస్సందేహంగా నష్టపోయేవారిలో ఉంటారు." (23 : 34)

**3. నాయకత్వానికై, ప్రపంచఖ్యాతికై ప్రలోభం**

ఒక వ్యక్తి ఇతరులు తనని పొగడ్తలతో ఆకాశానికెత్తివేయాలనే కోరికతో ఏదో ఒక రంగంలో తాను అందరికన్న మిన్న కావాలని ఆకాంక్షిస్తాడు. ఆ పొగడ్తలను విని, తాను పనులుచెయ్యటంలో దిట్టననే

భావన పెంపొందిం చుకుంటాడు. మరి తన లాంటి మరొక్కడు ప్రపంచంలో ఎక్కడైనా ఉన్నాడని తెలిస్తే తట్టుకోలేక ఆ వ్యక్తికి ప్రసాదింపబడ్డ కానుకలను – ముఖ్యంగా తన వద్దవున్నవే – విద్య, జ్ఞానం, శౌరత్వం, సిరిసంపదలు, ఉద్యోగం, లేక దైవారాధన – లాంటివి ఆ వ్యక్తికి దూరమైపోవాలని కోరుకుంటాడు. దీనికి కారణం అతడు తనకు సమానమైన వాడు, తనతో పోల్చటానికి సరియైనవాడు ఉండకూడదనే అతని గొంతెమ్మ కోరికపై చెడ్డ ప్రేమ మాత్రమే. ఈవిధంగా యెహూదీ మతం వారు రసూలుల్లాహ్ (సఅసం) వారి జ్ఞానాన్ని త్రోసిరాజని మరియు సమాజంలో తమ స్థానాలను పదిలం చేసుకోవటానికై ముహమ్మద్ (సఅసం) గారిని విశ్వసించలేదు.

## 4. వ్యక్తిలోగల చెడ్డ, మరియు శోకపరితాపాలు

మరికొంత మందికి నాయకులవ్వాలని గాని, తమ సామర్థ్యాలపై గర్వపడటం కాని ఉండదు. కాని ఇతరులకు మంచి కార్యాలు ఒనగూడటం అనేది సుతరామూ ఒంటికి పడదు. తత్ఫలితంగా వారు దుఃఖపడి క్రిందమీదులైపోతారు. ఇతరుల కష్టాల గురించి మరియు విపరీత పరిస్థితుల గురించి వింటేమాత్రం మహదానంద పడిపోతారు. ఏదో తమ వద్ద ఉన్న ఆస్తులనుండే లేక తనఖజానాల నుండే ఇతరులు ఊరకే తీసుకుంటునట్లు భావించి వారికి కష్టదుఃఖాలు కలగాలని ఆశగా ఎదురుచూస్తుంటారు. ఒక విద్వాంసుడు ఇలాగన్నాడు : "బఖిల్ (పిసినారి) తన సంపదతో పిసినారిగా ప్రవర్తిస్తాడు. "షహీహ్" దురాశపరుడు, ఇతరుల సంపదల గురించి పిసినారిగా ఐపోతాడు. (అంటే వాళ్ళకు సిరిసంపదలు కలగకూడదని కోరుకుంటాడు). ఈ రోగానికి మందు లేదు. ఎందుకంటే ఇది వ్యక్తి చెడ్డ మనస్తత్వానికీ, అతనిలోని (సద్గుణాల) లోటుకు ప్రతీకై సరిచేయడానికి కుదరని తెగులౌతుంది.

ఓ ముస్లిమ్ తమ్ముడా! హసద్ (అసూయ)కు చాల కారణాలున్నాయి. సామాన్యంగా ఈర్ష్య అనేది నాయకులలోనూ, సమాజంలోని పెద్దలుగా చెలామణీ అయ్యే వ్యక్తులలోనూ, తమ దగ్గరి బంధువుల్లోనూ మరీ ఇతరులలోనూ పొడసూపుతుంది. ప్రాపంచిక గొప్పలకై జరిగే పోటీలలో పరస్పర ఏహ్యాభావనలు, శత్రుత్వాలు కలుగుతాయి.

## హసద్ (ఈర్ష్య) దుష్ఫలితాలు

జరిగిన దానికి వెనువెంటనే ప్రతీకారం తీర్చుకోలేక, తన కోపాన్ని దిగమ్రింగుకోవలసి వస్తే ఆ నిస్సహాయత లోపలే కుములుతూ కుత్సితంగా ప్రాణం పోసుకుంటుంది. ఈ కుత్సితం - ఎనిమిది దుర్గుణాలకు దారితీస్తుంది :

1. ఈర్ష్య : ఒక వ్యక్తికి కలిగిన 'కానుకలను' అతనికి దూరం కావాలనే కోరికను ప్రోత్సహిస్తుంది. ఈర్ష్యాపరుడు (హాసిద్) ఇతరులకు కలిగిన భోగభాగ్యాలను చూసి దుఃఖపడతాడు. వారికి కలిగే కష్టనష్టాలకు సంతోషపడతాడు. విశ్వాస ఘాతకుల పనులు ఇలాగే ఉంటాయి.

2. ఎవ్వరికైనా కష్టదుఃఖాలు కలిగితే ఈర్ష్యాపరునిలోని "ఈర్ష్య" ద్విగుణీకృతమై అతని పాశవిక ఆనందానికి హద్దులు లేకుండా చేస్తుంది.

3. ఎదుటి వ్యక్తి స్నేహకాముకుడై దగ్గరికి వచ్చినా (ఈర్ష్యాపరుడు) అతనితో తెగతెంపులు చేసికొని అతనిని దూరంగా పెడతాడు.

4. ఎదుటి వ్యక్తి నుండి మరలిపోవటం, అతన్ని ఖాతరు చెయ్యకపోవటం, అతన్ని దిగజార్చేయటం - ఈ కుత్సితవ్యక్తి చేసే పనులు. మామూలుగా మనం చూస్తుంటాం విద్యావేత్తలను చూసి ఈర్ష్యపడే వారిని,

కొంతమంది దైవారాధకులను పట్టించుకోరు. కాని దైవారాధకుల్లో కొందరు ఇతర దైవారాధకులంటే అసూయపడతారు. కానీ వీరు విద్యావంతులంటే ఏమీ పట్టించుకోరు. వ్యాపారవేత్తలు ఇతర వ్యాపారస్తులను చూసి, వడ్రంగులు ఇతర వడ్రంగులను చూసి అసూయపడటం మీరు చూసేవుంటారు. శత్రుత్వానికి ముఖ్య కారణం పెక్కుమంది ఒకే గమ్యం వైపు కార్యోన్ముఖులై ఉండటమే. వివిధ రకాల మనుషుల్ని వారి గమ్యస్థానాలనేవి సమైక్యపరచలేవు. ఉదాహరణకు రెండు వేర్వేరు దేశాలలో ఉన్న యిరువురు వ్యక్తుల మధ్యలో ఎలాంటి సంబంధాలు ఉండవు. వారిలో ఈర్ష్య అనేదీ ఉండదు. కానీ వాళ్ళే గనుక, కీర్తి, ప్రశంసల్ని పొందాలనుకొంటే మాత్రం పోటీ, ఈర్ష్యలు తప్పవు. తనకున్న ప్రత్యేక గుణం లేక ప్రత్యేక కళకోసం వేరే వ్యక్తి పోటీ పడతాడని తెలిస్తే ఈర్ష్య అనేది తలెత్తుతుంది. ఇలాంటి వ్యక్తి తన గుణగణాలను గురించి ఆర్భాటపు ప్రలాపాలు ప్రేలుతాడు.

ప్రాపంచిక జీవనంపై గల వ్యామోహావే దీనికి నాంది. సర్వపోటీదారులకు అవకాశాలు కల్పించే వైశాల్యత ఈ బుద్బుధప్రాయ జీవనానికి లేదు. ఇందుకు విపరీతం, పరలోక జీవనం – చాలా విశాలమైనదీ, మరీ హద్దులు లేనిదీ.

ఈర్ష్య (హసద్) గనుక, తమ నాయకులకై, బంధువులకై, లేక స్నేహితులకై వుంటే దీనిని ఒక నీచమైన అమర్యాదతో కూడిన భావనగా పరిగణించబడుతుంది. ఈర్ష్యా రాహిత్యనికై (దైవం వద్ద) ఉత్కృష్టమైన బహుమతులున్నాయి :

ఈర్ష్య చాల నిక్కృష్టమైన స్వభావము. అసూయ ఇతరులకు హాని కలిగిస్తుంది. వారి నాశనానికి కారణం ఔతుంది. కాని స్వతహాగ ఈర్ష్యాపరునికి నష్టం వాటిల్లదు.

ఒక వ్యక్తికి గల ప్రత్యేక స్థానంపై మరియు అతనికై ప్రసన్నమయ్యే ఆ కానుక (ప్రసాదం)లపై ఇతరుల ఈర్ష్య ఆధారపడి ఉంటుంది. ఒక వ్యక్తి మంచివాడై, పలు కానుకలతో దైవ ప్రసాదాలతో విరాజిల్లుతున్నట్లైతే, ఈర్ష్య పడేవారు పలువురు తయారవుతారు. కాని ఒక వ్యక్తికి తక్కువ దైవప్రసాదలుంటే అసూయాపరుల సంఖ్య కూడా తక్కువగా ఉంటుంది.

5. ఆమోదయోగ్యం కాని లక్షణాలు : ఉదా : అబద్ధం (కద్బ్) గీబ (చాడీలు) లేక ఇతరుల రహస్యాలను, లేక బహిర్గతం చేయరాని విషయాలను బహిర్గతం చేయటం లాంటి దుర్లక్షణాలు కలుగుతాయి.

6. ఎవరినైనా తూలనాభావంతో అపహాస్యం పాలు చేయటం.

7. శారీరకంగా ఎవరికైనా హాని కల్గించటం.

8. 'పరాకు' (ఆమోదయోగ్యం కాని పనులు) : ఎవరి హక్కులనైనా వారికి దూరం చేయటం, బంధుమిత్రులలో సత్సంబంధాలు లేకుండా చేయటం, వగైరా....

ఈ ఎనిమిది దుర్లక్షణాల నుంచి విముక్తుడై కుత్సితానికి లోనుకాకుండా, కుత్సిత ప్రేరేపిత పాపాలను చెయ్యకుండా ఉంటే ఆ స్థితిలో కనీసపు 'దర్జా'గా లెక్కవేయబడుతుంది.

ఒక వ్యక్తిని ద్వేషించటం, అతనితో నిర్దయగా ప్రవర్తించటం, దైవసంస్మరణకై ఆ వ్యక్తితో కలవకపోవటం, మంచిపనులలో పాలు పంచుకోకపోవటం, ఆ వ్యక్తికి సహాయాన్ని నిరాకరించటం, అతనికై ప్రార్థనలు చేయకపోవటం – యిలాంటివన్నీ ఈ కోవకు చెందిన గర్హనీయమైన పనులే. ఇవన్నీ ఆ వ్యక్తిని ఉన్నత స్థానానికెదగకుండా లేక (అల్లాహ్ –సు.త– నుండి) పుణ్యఫలితాలను అందుకోకుండా అడ్డుకొంటూ ఆ వ్యక్తి విశ్వాసాన్ని నీరుగార్చివేస్తాయి. ఈ కార్యాలవలన దైవభక్తి కలగకపోవటం అనేది మరో ముఖ్య విషయం.

# ఈర్ష్యాపరునికి ఏమి ఒనగూడుతుందో

నిష్కల్మషమైన మనస్సుతో అల్లాహ్ (సు.త) వారి గ్రంథాన్ని పఠించి, అర్థం చేసుకొంటే ఈర్ష్య మరియు హద్దు మీరిపోవటం అనే లక్షణాలు దుర్గుణ గమ్యాలుగా మరియు స్వర్గప్రాప్తిని సద్గుణ గమ్యంగా స్పష్టంగా వేరువేరుగా చూడగలుగుతారు. హాబిల్ మరియు కాబిల్ మరియు యూసుఫ్ వారి అన్నతమ్ముళ్ళ కథల్లో ఈ జీవన గమ్యాలు ప్రస్ఫుటమవుతాయి.

ఈర్ష్యా, కుత్సిత రహితమైన పరిశుభ్ర హృదయాలను కలిగిన యాసీన్ గారి మిత్రుని కథలోనూ ఈ గమ్యాలను ప్రస్ఫుటంగా చూడగలుగుతారు.

తనవారు చంపి వేయగా ఆ మృతుడు యిలా అన్నాడు :

"ఇలా చెప్పబడెను : (ఆయనతో, అవిశ్వాసులు చంపినపుడు) "స్వర్గంలోకి ప్రవేశించు." ఆయన అన్నాడు : నేను కోరుకుంటాను, బహుశా నా వారికి తెలిస్తే బాగుంటుంది – ఇలాగ నా ప్రభువు (సు.త) నన్ను క్షమించి, గౌరవప్రదం చేశారని." (36 : 26, 27)

ఈర్ష్యకన్న మరో హానికరమైన చెడు లేదు. ఈర్ష్యకు గురైన వ్యక్తికి హానికలగకముందే, అసూయాపరునికి ఐదు పరీక్షలు కలుగుతాయి. మొదటిది అంతంలేని మనోవేదన. రెండవది, ఫలితంలేని పరీక్షలు. (కష్టాలు) మూడవది ప్రజల నిందకు గురికావటం నాలుగవది. అల్లాహ్ (సు.త) వారి ఆగ్రహానికి అర్హుడు కావటం ఐదవది – (దేవుని నుండి కలిగే) ఊత, సహాయ ద్వారాలు మూసుకపోవటం.

## ఈర్ష్యాపరునిపట్ల ఒక ముస్లిమ్ చూపవలసిన (ఉపయో గించవలసిన సాధనాలు) తీరుతెన్నులు

హాసిద్ (ఈర్ష్యాపరుని) పట్ల ముస్లిమ్‌లు అమలుపరచవలసిన విధానాలను, ఉపయోగించవలసిన సాధనాలను "కుర్ఆన్"లో విశదీకరింపబడ్డాయి. ఆలి ఇమ్రాన్ అనే సూరాలో ఇలా చెప్పబడింది.

**1. మొదటి పద్ధతి :**

"మరీ ఎవరైతే తమ కోపాలను దిగమ్రింగుకుంటారో మరియు మనుషులను క్షమించుతారో."

ఉత్తమ విద్యావేత్తల ప్రకారం మంచిచేసేవారు మూడు కోవలకు చెందుతారు. అట్టివారిలో 1. ప్రారంభదశలో ఉన్నవారు, 2. ఓ మధ్య పథంపై నడిచేవారు, మరియు 3. మంచి పనులు చేయటంలో అందరికంటే ముందుండేవారూ ఉన్నారు.

మొదటి కోవవారు తమను అగౌరవపరచినాసరే కోపాన్ని దిగమింగుతూ ఎలాంటి ప్రతీకారచర్యకు పాల్పడరు. ఇలాంటివారు అతిక్రిందవున్న మొదటి సోపానంపై ఉన్నారు. ఇక రెండవ సమూహంలో ఉన్నవారు తమ కోపాన్ని అదుపులో పెట్టుకుంటూ తప్పుచేసినవాళ్ళను క్షమించివేస్తారు. ఈ పద్ధతి హృదయ కల్మష నిర్మూలనానికి, మదిలో మంచి కోరికలను పెంచుకోవటానికీ అనుగుణమౌతుంది. ఎందుకంటే అట్టివారు అల్లాహ్ (సు.త) వారి నుండి మంచి బహుమానం పొందటానికే అలా చేస్తారు. ఇక మూడవ సముదాయానికి చెందినవారు తమ కోపాన్ని అణచుకొంటూ, ప్రజలను క్షమించివేస్తూ సత్కార్యాలను కూడా చేస్తారు. ఆ మంచి పనులలో ఇతరులకు మేలు చేయటం, వారిని దర్శించటం

వారికి కానుకలను బహూకరించటం ఉంటాయి. ఒక ముస్‌లిమ్ తన పద్ధతిలో ఈర్ష్య (హసద్) మరియు ఈర్ష్యాపరుని (హాసిద్)కై అల్లాహ్ (సు.త) వద్ద క్షమాభిక్ష అడుగుతూ ఉంటాడు. గతంలో తాను చేసిన తప్పులకై మరియు అతని శత్రువుల వలన కలిగిన దుఃఖాలకూ, ప్రాయశ్చిత్తం చేసుకొంటాడు. అల్లాహ్ (సు.త) ఇలా అన్నారు :

"మరి ఏదైనా దురదృష్టకరమైనది నీకు కలిగినచో, అది నీ చేతులారా ఆర్జించుకొన్నది మాత్రమే. మరి ఆయన (సు.త) అతిగా క్షమించేవారు." (42:30)

ఈర్ష్యా, ఈర్ష్యాపరుల నుండి తమను రక్షించుకోవటానికి అనుసరింపబడే **2. రెండవ పద్ధతి :** తమ అఖుంఠిత నమ్మకాలను అల్లాహ్ (సు.త) పై ఉంచి ఆయననే (సు.త) దిక్కుగా నమ్మటం. తాను తప్పించుకోలేనట్టి విపరీతమైన హానిని, అన్యాయాన్ని, తనకు దూరంగా త్రోసివెయ్యటానికి ఇంతకంటే (అల్లాహ్ (సు.త)పై నమ్మకం) శక్తివంతమైన విరుగుడు ఇంకోటి లేదని విశ్వసించటం. అట్టివారికై "ఇక ఎవరైతే తన విశ్వాసాన్ని అల్లాహ్ (సు.త) పై ఉంచుకోరో, ఆయన (సు.త) వారికై కావలసినంతగా సరిపడతారు." (65 : 3)

**3.** తమ రక్షణకై **మూడవ పద్ధతిలో** అల్లాహ్ (సు.త) నుండి "ఇస్తిఆదహ్" (ఆయన శరణు కోరటం) కుర్‌ఆన్ పారాయణం చేయటం మరియు దైవానుదేశం ప్రకారం ఆరాధనలు చేయటం వుంటాయి. అసూయాపరుల అసూయనుండి సురక్షితంగా ఉండటానికై అల్లాహ్ (సు.త) వారు తన ప్రవక్త (సఅసం) గారిని తన శరణుకోరమని ఆదేశించారు.

**4.** ఈర్ష్య మరియు ఈర్ష్యాపరుల మరియు శత్రువుల బారినుండి రక్షణకై **నాల్గవ పద్ధతి** దుఆలు చేయటం (ప్రార్థనలు).

**5.** ఇక **ఐదవ పద్ధతి** అసూయాపరుల పట్ల న్యాయంగా, ధర్మంగా ప్రవర్తించటం మరియు వారికై ఎలాంటి చెడు తలంపులు, శత్రుత్వం లేకుండా ఉండటం.

**6. ఆరవ పద్ధతి** ఈర్ష్యాపరులకు కూడా మంచి చేయటం. ఒకవేళ అతడు తన హానిని చెడ్డలను ద్విగుణీకృతం చేస్తే ముస్‌లిమ్ (ఆ వ్యక్తికై) తన సద్వర్తనాన్నీ మంచి సలహాలను, కనికరాలనూ ఈర్ష్యాపరుని పట్ల ఎక్కువ చేసుకోవాలని ఆజ్ఞ యివ్వబడింది.

**7. ఏడవ పద్ధతి** – అసూయాపరున్ని మిన్నగా ఆదరించి, అతనితో అతి స్నేహప్రవర్తనను చూపటంతో అల్లాహ్ (సు.త) వారు అసూయపడే వ్యక్తిని సన్మార్గము వైపు నడిపించి, ముస్‌లిమ్‌నకు అతని కీడునుండి విముక్తి కల్గిస్తాడు.

"శత్రువులను అణచివేయటంలో ఒక ఆశ ఉంది. కాని ఈర్ష్యపడేవారి శత్రుత్వం తప్ప" (ఒక కవిత్వం)

## సలఫ్ (సలఫ సాలిహీన్)

(అనగా విశ్వాసులలో మొదటి తరానికి చెందినవారు – ఖులఫా అర్రాషిద, సహాబాలు, అన్సారులు మొదలైనవారు.)

## "సలఫస్సాలిహీన్" వృత్తాంతాలు

బక్‌ర్ బిన్ అబ్‌దుల్లాహ్ అన్నారు :

1. ముఆవియహ్ బిన్ అబూ సుఫ్‌యాన్ ఇలా అన్నాడు, "ఈర్ష్య (అసూయ)లో లాగే దుష్కార్యాల్లోనూ న్యాయమూ, ధర్మమూ అనేవి ఉండవు."

ఇబ్న్‌సిరిన్ అన్నారు : "నేనెన్నడూ ఎవరిపైనా అసూయ పడలేదు. స్వర్గానితో పోలిస్తే ఈ యావత్ప్రపంచమూ ఓ చిన్న యిసుక రేణువులాంటిది కూడా కానేరదు. మరీ నేను స్వర్గవాసులను చూసి ఈర్ష్య ఎలా పడతాను, వారికి భువిలో కలిగిన దేనికో, (ఏ వస్తువునకై). మరి అతను నరకనివాసి అయితే అతనికి ఈ ప్రపంచంలో కలిగిన ఏదో దానికై నేను అతని పట్ల ఎలా ఈర్ష్య చెందను."

2. అబ్దుల్లాహ్ బిన్ అల్ ముఅతజ్ అన్నారు : "ఈర్ష్యాపరుడు పాపరహితమైన వ్యక్తులపై కోపంతో వుంటాడు. అతడు తన వద్ద లేని వస్తువులపై పిసినారితనాన్ని ప్రదర్శిస్తాడు. మరీ తాను పొందలేని వాటికై అర్రులు చాస్తాడు." మరో కథనం ప్రకారం ముఆవియహ్ బిన్ అబు సుఫ్‌యాన్ తన కుమారునితో ఇలా అన్నట్లు ఉవాచ :

"ఈర్ష్య విషయంలో జాగ్రత్తగా ఉండు నా పుత్రుడా! నీ అసూయతో ఇతరులకు అపకారం కలగకముందే అది నీపై తన దుష్ప్రభావాలనూ, దుష్ఫలితాలనూ చూపిస్తుంది."

3. ఔన్ బిన్ అబ్దుల్లాహ్ "వాసిత్ రాజ్యానికి రాజైన అల్ ఫద్‌ల్ బిన్ అల్ ముహలబ్ వద్దకు వెళ్ళి ఇలా అన్నారు : "నేను నీకో ఉపదేశం చేయాలనుకున్నాను." ఏమిటది అని ఔన్ అడిగారు. "ధిక్కారం విషయంలో జాగరూకుడై ఉండు – ఎందుకనగా అల్లాహ్ (సు.త) యొక్క ఆజ్ఞలను ధిక్కరిస్తూ చేయబడిన మొట్టమొదటి పాపం అదే కాబట్టి" అని అంటూ ఈ కుర్‌ఆనీ వాక్యాన్ని వినిపించాడు.

"మరి (గుర్తుచేసుకో) మేమె (సు.త) న్నడు దైవదూతలకు ఇలా 'ఆదమ్ ముందు సాష్టాంగప్రణామము చేయండి' అని చెప్పామో. (షైతాన్) ఇబ్‌లీస్ తప్ప మిగిలిన వారందరూ సాష్టాంగపడ్డారు. అతను (షైతాన్)

గర్విష్ఠిపోయి, మరియు అవిశ్వాసులలో ఒకడైపోయి నిరాకరించాడు.” (2:36)

“దురాశ అంటే జాగ్రత్తగా వుండు, ఎందుకంటే (దురాశే) ఆదంను స్వర్గాన్నుంచి గెంటివేయించింది. అల్లాహ్ (సు.త) ఆదమ్‌ను స్వర్గనివాసిగా చేసి, అక్కడవున్న ఒక వృక్ష ఫలాలను తప్ప, సమస్తమూ ఆరగించమని అతనికి అనుజ్ఞ యిచ్చియున్నారు. ఆదం నిషిద్ధమైన ఆ చెట్టు పండ్లను తినటం వలన అల్లాహ్ (సు.త) అతనిని స్వర్గం నుంచి బహిష్కరించారు.” తర్వాత జౌన్ వినిపించాడు.

“తర్వాత వారిద్దరిని స్వర్గం నుండి జారవేసి, వారుంటున్న దానిలో (స్వర్గం) నుంచి బహిష్కృతం చేయించింది షైతాన్. మేము (సు.త) అన్నాము : ‘క్రిందికి (భువిపైకి) పతనమై పోండి, మీలో పరస్పరం శత్రుత్వంతో.” (2:36)

ఈర్ష్య అంటే జాగ్రత్తపడండి. దీనివలననే ఆదం యొక్క ఓ కుమారుడు, వేరొక కొడుకును హత్య చేశాడు. తర్వాత జౌన్ ఈ వాక్యాలను ఉచ్చరించాడు.

“మరి (ఓ ముహమ్మద్ సఅసం) వినిపించు వారికి (యెహూదీలకు) ఆదం గారి యిద్దరు పుత్రుల కథ. (హాబిల్ మరియు కఅబిల్) – సత్యంగా, వారిరువురు అల్లాహ్ (సు.త)కై బలి యిచ్చారు. ఒకరి బలి ఆమోదించపబడగా మరొకరిది తిరస్కరింపబడినది. రెండోవాడు, మొదటివాడితో ‘తప్పకుండా నిన్ను చంపేస్తాను”అని అన్నాడు. మొదటివాడు, ‘సత్యంగా, అల్లాహ్ (సు.త) వారు ఆమోదిస్తారు – అల్ ముత్తకీన్ (విశ్వాసంలో ఉత్తములు) చేసే (ఆరాధనలు) అని జవాబిచ్చాడు.” (5:27)

నా ముస్‌లిమ్ తమ్ముళ్ళారా! ఓ కవి చెప్పినట్లుగా, మీకు సలహా యిస్తున్నాను :

"ఓపికతో ఉండు – ఈర్ష్యాపరుల దుష్కార్యాలపై నీ ఓపికే – వారిని నాశనం చెయ్యగలదు. అగ్ని తనను తానే కబళిస్తుంది. మరేదీ కాల్చడానికై దొరకకపోతే." (ఓ కవిత)

# హృదయ ప్రక్షాళనకై కొన్ని సూచనలు

పరిశుద్ధ దైవ హృదయం 'షిర్క్' కుత్సితం, ద్వేషం, ఈర్ష్య, పిసినారితనం, ధిక్కారం, ఐహిక ప్రపంచ మోహం, నాయకత్వపు వెర్రి మొదలైన దుర్గుణాలకు దూరంగా ఉంటుంది.

ఏ హృదయమైతే అల్లాహ్ (సు.త) కు దూరం చేసే చెడులకు ఆలవాలం కాదో, అల్లాహ్ (సు.త) వారి దివ్య గ్రంథాల పట్ల ఏలాంటి సందేహాలకు తావివ్వదో, మరీ ఆయన (సు.త) ఆజ్ఞాపాలనలో అడ్డంకులుగా తయారయ్యే కోరికలకు ఊతమివ్వదో అలాంటిదే పరిశుద్ధమైన హృదయం.

హృదయ ప్రక్షాళన, తదితర విభిన్న విపరీత శక్తులను విశ్వాసంతో సమన్వయం చేయటం దైవభీతికి అత్యవసరమైన సరంజామాలు. అందువలననే అల్లాహ్ (సు.త) వారు 'సూరతుల్ అన్ఫాల్' లో యిలా విశదీకరించినారు:

"అందువలన దైవభీతి కలిగి ఉండు. మరి మీలోని పరస్పర అనంగీకారాలను సమన్వయం చేసుకోండి." (8:1)

ఇబ్న్ అబ్బాస్ (ర.అ) అన్నారు : 'ఇది అల్లాహ్ (సు.త) వారి నుండి విశ్వాసులకై ఒక ఆజ్ఞ : దైవభీతి కలిగి ఉండమని మరియు పరస్పర స్పర్థలను సరిదిద్దుకోమనీ."

దైవప్రవక్త (సఅసం) సర్వోత్తమవ్యక్తి ఎవరని ప్రశ్నింపబడగా ఇలా సెలవిచ్చారు :

"పరిశుభ్రమైన హృదయం కలిగిన మరియు సత్యసంధుడైన వ్యక్తి". 'మాకు సత్యసంధత తెలుసుకానీ, పరిశుభ్రమైన హృదయం అంటే ఏమిటని' సహాబాలు అడిగారు. ఆయన (సఅసం) జవాబిచ్చారు : 'ఏ వ్యక్తిఅయితే దైవభీతి కలిగి, పరిశుద్ధంగా ఉంటాడో, పాపాల నుండి, హద్దుమీరటాల నుండి ఈర్ష్యా ద్వేషాల నుండి విముక్తుడై ఉంటాడో అతని హృదయమే (పరిశుద్ధమైన హృదయం)."

## ఈర్ష్య నుండి విముక్తికై పశ్చాత్తాప సాధనాలు

**(1)** అసూయనుండి విముక్తికై పశ్చాత్తాపం చెయ్యటానికి అత్యవసరమైనది – హృదయ నిర్మలతలో నుండి ఉద్భవించే నిజమైన పరితాపం. జైద్ బిన్ తాబిత్ (ర.అ) ప్రకారం ప్రవక్త గారు (సఅసం) యిలా అన్నారు : "ఏ విశ్వాసి అయినా ఈ మూడు గుణాలు తన వద్ద ఉండటాన్ని అయిష్టపడడు – తన కార్యాచరణలో నాయకులకు మరీ ఇతరులకూ సలహాలివ్వటంలో, జమఅ (ముస్లిం సమాజం)తో అవిచ్ఛిన్న సంబంధం కలిగి ఉండటంలో మరియు సదా నిర్మలంగా ఉండటం." (అహ్మద్ + ఇబ్న్ మాజ)

ఒక వ్యక్తి అల్లాహ్ (సు.త) అంటే నిజమైన విశ్వాసం కలిగి ఉండి ముస్లిమ్ తమ్ముళ్ళకై ప్రేమ భావాన్ని తప్ప మరే యితర ఆలోచనలూ మనసులో పెట్టుకోడు. ఈ ప్రాపంచిక విషయాల్లోనైనా లేక పరలోకపు విషయాల్లోనైనా వారికి (ముస్లిమ్‌లకు) ఏదైనా శుభం కలిగితే అతడు చాలా సంతోషపడతాడు. మరీ వారికేదైన కీడు కలిగితే అతిగా దుఃఖిస్తాడు.

**(2)** తన ప్రభువు పట్ల సంపూర్ణ విశ్వాసంతో, తృప్తి చెంది వుండటం. ఇబ్న్ అల్ కయ్యిమ్ ఇలా అన్నారు : "అది (తృప్తిచెందటం)

శాంతి, భద్రతలకు ద్వారం లాంటిది." అది అతని హృదయాన్ని ద్వేషభావాన్నుండి, చెడునుండి, మరియు కుత్సితాల నుండి స్వచ్ఛంగా ఉంచుతుంది. ఎవ్వరూ అల్లాహ్ (సు.త) వారి కఠిన శిక్షల నుండి రక్షింపబడలేరు - ఎవరైతే స్వచ్ఛమైన హృదయంతో ఆయన (సు.త) వద్దకు వచ్చేవారు తప్ప. అసంతృప్తితో నిండి ఉన్నవారు హృదయ పరిశుద్ధతను ఎన్నడూ పొందలేరు. ఎంత ఎక్కువగా తృప్తిని కలిగిఉంటారో వ్యక్తులు, వారి హృదయాలు కూడా అదే నిష్పత్తిలో నిర్మలంగా పరిశుద్ధంగా ఉంటాయి. పరిశుద్ధత, దైవభీతి, మరియు నిర్మలతలనేవి తృప్తికై సహచరులుగా పనిచేస్తాయి. ఈర్ష్య అసంతృప్తి ఫలితమే ఐతే హృదయ పరిశుద్ధత తృప్తి ద్వారా ప్రాప్తించేది.

**(3)** కుర్‌ఆన్‌ను పఠించి, దాని అర్థాన్ని గ్రహించడం మూడవ ఆవశ్యకత. అన్ని రోగాలకూ కుర్‌ఆనే చికిత్స. ఎవరైతే అల్లాహ్ వారి (సు.త) గ్రంథాన్ని చికిత్సకై పరికించడో పరిశీలించడో అతడే తన సర్వాన్ని పోగొట్టుకొన్నవాడు. అల్లాహ్ (సు.త) ప్రవచించారు :

"చెప్పు : అది విశ్వాసులకొరకై, ఒక మార్గదర్శనము, మరీ ఆరోద్యప్రదాయిని." (41:44)

"మరి మేము మీకై కుర్‌ఆన్‌ను పంపినాము, అది విశ్వాసులకై ఆరోగ్యప్రదాయిని మరియూ కరుణ." (17:82)

ఇబ్న్ అల్ కయ్యిమ్ అన్నారు : "ఈ వాక్యం యొక్క భావన ఏమిటంటే కుర్‌ఆన్ పూర్తిగానూ లేక కుర్‌ఆన్ లో ఏ భాగమైనా ఈ చికిత్సకై పనిచేస్తుందని."

"ఓ మానవజాతివారా! మీకో మంచి ఉపదేశం మీ రబ్ (సు.త) నుండి వచ్చి ఉన్నది, మరీ మీ హృదయాలలోని (మాలిన్యానికి) ఉపచారమూ కూడా."

అందువలన, కుర్‌ఆన్ ఈ జీవితంలోనూ, పరలోకంలోనూ అన్ని శారీరక మరియు మానసిక రుగ్మతలకు పరిపూర్ణమైన చికిత్స.

**(4)** కుత్సితం, ఈర్ష్య, గీబ (చాడీలు) నమీమ (నిందలు మోపడం) మరియు పరిహాసంలాంటి తమలోని దుర్లక్షణాలతో, దుష్టకలాపాలతో ముస్‌లిమ్‌లకు హానికలిగించే వారికి ఎలాంటి కఠిన శిక్షలు పడతాయో – ఆ శిక్షల గురించి ఆలోచన చెయ్యటం, ఆ విపరీత పరిణామాల బేరీజు వేసుకోవటం నాల్గవ ఆవశ్యకత.

**(5)** దైవ ప్రార్థనలు (దుఆ) : తన అన్నతమ్ముళ్ళతో పాటు తనలో ఉన్న మలినాన్ని తీసివేసి హృదయ ప్రక్షాళనకై ప్రతి దాసుడూ అన్నివేళలా ప్రార్థనలు చేయాలి. తన అన్నతమ్ముళ్ళు సత్కార్యాలను చక్కగా చేయాలని వారికై ప్రార్థనలు చెయ్యాలి. అల్లాహ్ (సు.త) ప్రస్తావించారు

"మరి వారి తర్వాత వచ్చేవారు ఇలా అంటారు : 'మా ప్రభూ! మమ్మల్ని మన్నించు, మరీ మా కంటే ముందే గతించిన మా విశ్వాసం కలిగిన అన్న తమ్ముళ్ళనూ. విశ్వాసుల పట్ల ఎలాంటి ఏహ్యాభావానికీ మా హృదయాలలో తావివ్వకు. ఓ మా ప్రభువా! మీరు దయతో పరిపూర్ణమైవున్నారు. (మీరే) అత్యంత కరుణామయులు." (59:10)

**(6)** 'సదక' లేక దానం చేయటం ఆరవది. దానం చేయటం హృదయ మలినాలను దూరం చేసి, హృదయాలకు పరిశుద్ధతను ఆపాదిస్తుంది. ఈ కారణంవలననే అల్లాహ్ (సు.త) దైవప్రవక్తను (సఅసం) యిలా ఆజ్ఞాపించారు.

"వారి సంపదల నుండి సదక (దానం)ను పుచ్చుకోండి. దానితో వారి హృదయ మాలిన్యాలను ప్రక్షాళనంచేసి వారిని పరిశుద్ధపరచుటకై." (9:103)

ప్రవక్తగారు (సఅసం) అన్నారు :

"మీలోని రోగభూయిష్టులకు సదక (దానం)తో చికిత్స చేయించండి." (అబూ అష్‌షేక్ నుడివిన ప్రకారం)

ఎవరి హృదయాలైతే రోగగ్రస్థం అయ్యాయో అట్టివారికే 'చికిత్స' అనేది అత్యవసరం ఔతుంది. మనకు మన హృదయాలను గురించే చింతించడం అతి ముఖ్య విషయం.

**(7)** గుర్తుంచుకోవాల్సిన విషయం ఏమిటంటే, మనం నిత్యం విషాన్ని చిమ్మేది, బాణాలను ఎక్కుపెట్టేది, మన ముస్‌లిమ్ అన్నతమ్ముళ్ళపైనేననీ. అతడూ యెహూదీ లేక ఈసాయీ (క్రిస్టియన్) కాదనీ మనం గుర్తుచేసుకోవాలి. మన తోటి ముస్‌లిమ్‌కు ఎలా హానిచెయ్యగలం?

**(8)** 'సలామ్' (శాంతికాముకత) అనే ఇస్లామీ అభివాదాన్ని విస్తరింపజేయటం అబూ హురైరా (ర.అ) ప్రవక్త (సఅసం) గారి ఈ ప్రవచనాలను ఉటంకించారు ఇలా :

"అల్లాహ్‌పై ఒట్టు! ఎవ్వరి చేతిలో నా ప్రాణాలున్నాయో – నీవు స్వర్గంలోకి అడుగుపెట్టలేవు, విశ్వసించేవరకు, పరస్పరం ప్రేమాభిమానాలుంటే కాని విశ్వాసులు కాలేరు. మీరు ఒకరినొకరు ప్రేమించటానికై నేనొక విషయాన్ని చెప్పవచ్చా? సలాం చేయటాన్ని మీలో విస్తృతం చేయండి."

ఇబ్‌న్ అబ్‌దుల్ బర్ర్ అన్నారు :

"సలాం చేయటం వలన ద్వేషం పోయి, ప్రేమ ఉద్భవిస్తుందని దీని ఫలితంగా తెలుస్తున్నది." (ముస్‌లిమ్)

అల్లాహ్ వారి శాంతి, వారి కరుణామృత దీవెనలు దైవప్రవక్త (సఅసం) వారిపై, వారి గృహస్తులపై మరియు వారి అనుచరులపై సదా ప్రసరించుగాక! (ఆమీన్ యా రబ్బల్ ఆలమీన్)

-: సమాప్తం :-

**నోట్ :** చక్కని, మంచి విషయాలన్నీ అల్లాహ్ (సు.త) తరపు నుండి వచ్చాయి. ఈ పుస్తకంలోని అన్ని తప్పులూ ఈ అబ్దుల్లావే అని గుర్తించి, తెలియజేయవలసినదిగా కోరుకుంటున్నాను. - అబ్దుల్లాహ్

BACKBITING (Telugu)

# పరోక్ష నింద (అల్ గీబ)

## (ముస్లిమ్ సమాజంపై దాని దుష్ప్రభావాలు)

*సంకలనం :*

**అబ్దుల్లాహ్ జుల్ఫిఖార్ అలీ**

*ప్రకాశకులు :*

క్వెస్ట్ ఫర్ ట్రూత్ అండ్ అటైన్మెంట్

# 17-1-375/ఇ/35/14/1,

ఖుర్షీద్ జాహి మస్జిద్ ప్రక్కన, సంతోష్నగర్,

సఈదాబాద్, హైదరాబాద్ - 500 059

Cell : 9247191301

బిస్మిల్లాహ్ హిర్రహ్మా నిర్రహీం
అమిత దయాళు అపార కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో

## ముందుమాట

ఈనాడు సమాజంలో ఉన్న పెక్కు చెడు రుగ్మతలలో, "అల్ గీబ" – "పరోక్షనింద" – ముఖ్యమైనది. దీనిని అన్ని సమయాల్లోనూ వర్జింపవలసిన, అతి హేయమైన సామాజిక రుగ్మతగా గుర్తించాలి.

ముస్లిమ్ సమాజంలో వ్యాపించి పోయి, ముస్లిమ్‌లలో అనైక్యత, ద్వేషం, శత్రుత్వం అనే దుష్ఫలితాలను పెంపొందించగల కారణంగా మన ఇస్లామ్ మతం పరోక్షనింద (అల్ గీబ)ను ఏహ్యాభావంతో నిషేధపరచింది. అందుకనే ఈ దురలవాటు, వ్యక్తి "మృతసహోదరుని మాంస భక్షణ"తో సమానంగా పోల్చబడి వర్జనీయంగా వర్గీకరింపబడింది. అల్ గీబ అంటే ఒక వ్యక్తి గురించి అతని లోపాలను గురించి లేక అతని ప్రవర్తన లేక అతని ఇతర విషయాలపై పరోక్షంగా ప్రస్తావించటం. ఇలాంటి ప్రస్తావన అతనికి అసహ్యకరంగా ఉంటుంది. ఇది అల్లాహ్ దృష్టిలో ఘోర పాపం.

అందువలన అల్లాహ్ అసహ్యామైన ఈ పాపానికి ఒడిగట్టకూడదని మనల్ని ఆజ్ఞాపించాడు. మరి మనం ఈ విషయంలో చాలా జాగరూకులై ఉండాలి. మనం మన పిల్లలలో బాల్యం నుండే ఈ దురలవాటు చోటు చేసుకోకుండా తగు జాగ్రత్తలు తీసుకోవాలి. ఎందుకంటే వారు సచ్ఛీలురుగా పెరిగి పెద్దవారు కావాలి.

చిన్న పిల్లలు తొందరగా ప్రభావితులయ్యే అన్ని రకాల మరియు

వివిధ రూపాల పరోక్ష నింద (అల్ గీబ)ల వివరాలను ఈ చిన్న పుస్తకంలో పొందుపరచాము.

విషయ సంగ్రహణకు అనుకూలంగా ఉండే ఆ లేత వయస్సులోనే తలిదండ్రులు తమ పిల్లలకు అత్యవసరమైన ఇస్లామీయ బోధనలను నెరపాలి. పిల్లలకూ, మంచి పుస్తకాలు చదివే హక్కు ఉన్నది కాబట్టి అమ్మానాన్నలు తమ పిల్లల అవసరాలను పరిగణనచేసి పరిపూర్ణం చేయాలి.

మనమందరమూ మన బాధ్యతలను సక్రమరీతిలో నిర్వహించాలని మేము అల్లాహ్ వారిని ప్రార్థిస్తున్నాము.

*- ఆమీన్ యా రబ్బుల్ ఆలమీన్.*

*- అబ్దుల్లాహ్ జుల్ఫిఖార్ అలీ*

# పరోక్షనింద

## ముస్లిమ్ సమాజంపై దాని దుష్ఫలితాలు

సమస్తస్తోత్రాలూ అల్లాహ్ వారికే. మరి దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లమ్, వారి సంతానం, వారి అనుచరులు మరియు వారి అనుయాయులు – వీరందరిపై అల్లాహ్ వారి శాంతి మరియు దీవెనలు ప్రసరించుగాక!

నిస్సందేహంగా మనుష్యజాతిపై అల్లాహ్ వారు తమ అపారమైన వైవిధ్యమైన ప్రసాదాలను, కానుకల వర్షంగా కురిపించారు. అలాంటి ఈ ప్రసాదాలలో “ఇస్లామ్” తర్వాత చెప్పుకోతగినది – జిహ్వాతో మాట్లాడగలగటం – సంభాషణకు నోచుకోవటం.

కానీ, మనిషి నాలుక – రెండు వైపులా పదునైన ఒక ఆయుధం (కరవాలం) లాంటిదే. “కుర్ఆన్” పఠనం, సత్కార్యాలకై ప్రేరేపించటం, దుష్కార్యాలను ఆపివేయటం, దీనులను ఆదుకోవటం, ఉత్తమ కార్యాచరణకై ఆరాటపడటం మరియు అల్లాహ్ వారి విధేయతకు దారితీసే వినమ్రకార్యాలను చేయటానికై “నాలుక”ను ఉపయోగిస్తే అది ఆమోదయోగ్యమే. అల్లాహ్ తమకు ప్రసాదించిన వనరులకై మానవుడు తృప్తితో, సౌశీల్యుడై ఉండాలి. దీనికి వ్యతిరేకంగా, షైతాన్‌పై విశ్వాసం గల వ్యక్తి ముస్లిమ్ సమాజాన్ని విచ్ఛిన్నం చేయటానికై, అసత్యం చెప్పటానికై, పరోక్షనింద చేయటానికై, ఇతరులపై అభాండాలు వేయటానికై, ముస్లిమ్‌లను అగౌరవపరచుటకై లేక అల్లాహ్ మరియు దైవప్రవక్త (సఅసం) వారు నిషేధించిన పనులు చేయటానికై తన నాలుకను ఉపయోగిస్తే – ఈ దోరణి హేయమైనదీ, నిషిద్ధమైనదీ కూడా. ఇది జిహ్వాజనిత అపకారామూ – మానవాళికి గొప్ప అనర్థమూ.

మనుషులకు తమ నాలుకలను హద్దులలో పరిమితం చేయటం కంటే – నిషిద్ధ ఆహారాన్ని విసర్జించటం, అన్యాయానికీ, అక్రమ లైంగిక సంబంధాలకూ, దొంగతనాలకూ, త్రాగుడుకూ దూరంగా ఉండటం సులభసాధ్యతరమే. ఈ కారణం వల్లనే నిషిద్ధ కార్యాల నుండి తమను తాము రక్షించుకొనే కొంతమంది, "అల్లాహ్ వారి భక్తులు" కూడా కొన్ని సమయాల్లో తాము పలికే "భాషణల" చెడు పరిణామాల గురించి పట్టించుకోకుండా, అల్లాహ్ వారి కోపానికి కారణం అయ్యే పదాలను తమ నోళ్ళతో ఉచ్చరిస్తారు. మరీ ఒక వ్యక్తి అశ్లీలాల నుండి, హద్దు మీరటాన్నుండి దూరంగా ఉండటానికై శాయశక్తులా కృషి చేస్తాడు. కాని అతని పదునైన నాలుక బ్రతికేవున్న మరియు విగత జీవులైన వ్యక్తుల మానమర్యాదలని చీల్చి చెండాడుతుంది, వారి హత్యకు కారణమౌతుంది. అట్టివారు తమ సంభాషణా ధోరణినికి తగిన ప్రాముఖ్యతను యివ్వరు. మనిషికి కావలసిన నైతిక శక్తి, శారీరక బలం అల్లాహ్ వారి నుండి మాత్రమే లభిస్తాయి.

## "గీబ" పరోక్ష నింద - దాని వర్ణణ

దైవప్రవక్త (సఅసం) పరోక్షనిందను ఇలా వర్ణించారు, తన ప్రవచనంలో:

"అల్ గీబ (పరోక్షనింద) ఏమిటో మీకు తెలుసా?"

"అల్లాహ్ మరియు వారి ప్రవక్త మాత్రమే (ఈ విషయం) తెలిసినవారు" అని జవాబిచ్చారు అనుయాయులు.

మరీ ఆయన (సఅసం) అన్నారు :

"నీ సోదరుని గురించి అతడు అసహ్యించుకునే విషయాన్నే చెప్పటం."

ఇలా అడగబడింది : "నేను మాట్లాడే విషయం (యదార్థంగానే) ఆయనలో ఉన్నట్లైతే ఎలా?"

"నీవు ఉటంకించే విషయం ఆయనలో (నిజంగానే) ఉంటే, నీవు 'గీబ' (పరోక్షనింద)ను ఆపాదిస్తున్నావు అతనిపై. మరి, ఆ విషయం ఆయనలో లేకపోతే (నిజంగానే) నువ్వాయనపై అభాండాలు (బుహ్‌తాన్) వేస్తున్నావు."

ఒక వ్యక్తిలో అతడు ఏహ్యపడే ఏదో గుణాన్ని లేక ప్రత్యేకాంశాన్ని (అతను లేని సమయంలో) పరోక్షంగా అనటమే, "గీబ" (పరోక్షనింద). ఇంతకంటే మిన్న చర్చించిన ఆ గుణం లేక విశేష లక్షణం ఆయనలో లేకపోతే మాత్రం – ఆ నిందావచనాలు, "బుహ్‌తాన్" (అభాండాలు వేయటం) ఔతాయి.

అంటే, అసత్యమూ, కల్పితమూ అని పిలువబడుతుంది. "బుహ్‌తాన్" అనే పాపము "గీబ" కంటే చాల ఘోరమైనది.

## (పరోక్ష నింద) 'గీబ' విషయంలో ఇస్లామీయ (షరయీ) నిర్ణయాలు మరియు ఆ నిర్ణయాలకై సాక్ష్యాధారాలు

ముస్లిమ్‌లు ఎదుర్కొని తిప్పి కొట్టవలసిన హేయమైన సామాజిక రుగ్మతలలో "గీబ – పరోక్షనింద" ముఖ్యమైనది. 'ఇజ్‌మా' అనగా గొప్ప ముస్లిమ్ ధార్మికవేత్తల సమూహం "గీబ"ను ఘోరమైన పాపాలలో ఒకటిగా వర్గీకరించి దానిని నిషేధించారు. ఇస్లామ్ ధర్మం కూడా "గీబ"ను నిషేధించింది. కారణం "గీబ" వలన సౌభ్రాతృత్వ బాంధవ్యాలు తెగిపోవటం, రాగానుబంధాలు చెడిపోవటం, శత్రుత్వ బీజాలు నాటుకోవటం, తప్పిదాలు విస్తృతపడడం జరుగుతుంది. ముస్లిమ్‌ను మరీ ఎంతగానో ఈ దుష్టకార్యానికి ఒడిగట్టకుండా వారిస్తూ "కుర్‌ఆన్" దివ్య గ్రంథం పరోక్షనిందాపరున్ని తన "మృతసోదరుని మాంసాన్ని భక్షించే

కఠోర మానవునితో సమానం"గా వర్ణించింది. అల్లాహ్ ఇలా అన్నారు:

"…. మరి మీరు ఒకరిపై మరొకరు "పరోక్షనింద"లు విసురుకోకండి. మీలో ఒకరు – విగత జీవుడైన మీ సహోదరుడి మాంసాన్ని తినగోరుతాడా? మరి మీరు అసహ్యించుకుంటారు దీనిని." (49:12)

అందువలన తన సోదరున్ని 'పరోక్షనింద'కు బలిచేసే వ్యక్తి తన విగతజీవ సహోదరుని కాయాన్నుండి మాంసాన్ని కొరికి తింటాడు కాని, ఆ కొరుకుడు వలన కలిగే లేక తినబడటంచే అతనికి కలిగే బాధను, అనుభూతిని తెలుసుకోలేడు. ఇబ్న్ కతీర్ మరియు అల్ కుర్తుబీ అనే ధార్మిక విద్వాంసులు పై కుర్ఆనీ ఆయత్‌పై తమ వివరణ యిలా చేశారు : "గీబ" (పరోక్షనింద) నిషేధింపబడినది. (ధార్మిక విద్వాంసుల) ఏకీకృత నిర్ణయంతో". మరియు ఆయిషా (రజియల్లాహు అన్హా) యిలా విశదీకరించారు, "నేను దైవప్రవక్త (సఅసం)గారితో యిలా అన్నాను, 'నేను సఫియ్య (ఒక స్త్రీ)ని గురించి ఆమె ఇలా…. ఇలా ఉన్నదంటే సరిపోతుంది." (ఆమె పొట్టిగా ఉన్నారని అర్థం). ఆయన (సఅసం) అన్నారు :

"నీవు ఉచ్చరించిన ఆ పదం – సముద్రంలో కలిపేస్తే (మొత్తం) సముద్రాన్నే మాలిన్యం చేసేస్తుంది." (సహీహ్ అబూదావూద్)

## పరోక్షనిందలను ఆలకించే వ్యక్తి - పరోక్షనిందాపరునితో సమానమే.

పరోక్షనిందాపరుడి నిందారోపక వచనాలను ఆశ్చర్యంతోనూ, అమితానందంతోనూ వినేవ్యక్తి కూడా "గీబ" అమలుచేసే వ్యక్తిలాగే అదే గర్హనీయమైన కోవలోకే చెందుతాడు. ఇలాంటి ప్రవర్తన "పరోక్షనిందాపరుణ్ని" మరింతగా దుష్ట కార్యోన్ముఖుడు కావడానికై

ఉత్తేజితపరుస్తుంది. అతని నిజ సత్యసంధతను చాటిచెప్పటానికీ మరియు ధృవీకరించడానికై యిదో తరహా. ఎప్పుడైతే వినేవ్యక్తి – పరోక్షనిందాపరుని మాటలను స్వీకరిస్తాడో మరీ – విని సంతోషపడతాడో వెంటనే అతడు కూడా ఆ పాపంలో భాగస్వామి అయిపోతాడు.” అన్ నవవీ (ధార్మికవిద్యావేత్త) యిలా అన్నారు, “తెలుసుకోండి! ఎవరైనా ఒక ముస్లిమ్‌ను పరోక్షనిందలకు గురిచేస్తుంటే – వెంటనే ఆపు చేయించాలి. మరీ ఆ నిందకు పాల్పడే వ్యక్తికి మంచి మాటలతో బుద్ధిచెప్పాలి. అలా చేయలేకపోతే, చేతి సంజ్ఞలతోనైనా అడ్డుపడాలి. తన నోటితోనూ, సంజ్ఞలతోనూ ప్రత్యర్థిని నిలువరించలేకపోతే ఆ ప్రదేశాన్ని (పరోక్షనింద జరుగుతున్న స్థలాన్ని) వెంటనే విడిచిపోవటం అతనికి తప్పనిసరైపోతుంది.

ఇతర పరిస్థితుల్లో ఉపాధ్యాయులపై లేక గౌరవనీయులపై లేక తనపై హక్కుగల వ్యక్తులపై ఎవరైనా పరోక్షనింద (గీబ)లు ఆపాదిస్తుంటే ఆ వినేవ్యక్తి పైన విశదీకరించిన పద్ధతిని గట్టిగా అమలుచేయాల్సి ఉంటుంది. (అల్ అద్‌కార్ : 294)

## తన ముస్లిమ్ సహోదరునిపై “గీబ” పరోక్షనిందారోపణ జరిగే సమయంలో ఆ వినేవ్యక్తి కర్తవ్యం ఏమిటి?

దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారు :

“ఎవరైతే తన సహోదరుని పరోక్షంలో, అతని గౌరవమర్యాదలను కాపాడుతాడో – అతనికి తనను అల్లాహ్‌తో నరకాగ్ని నుండి రక్షణ కోరుకొనే హక్కు ఉంటుంది.” (అహ్మద్ : సహీహ్ అల్ జమిఇ : 6240)

## “గీబ” పరోక్షనిందకు కారణాలు

విజయకాంక్షతో మరియు తన హృదయంలో ఇతరులకై

నిండిపోయిన, ఏహ్యాభావాన్ని, అక్కసును వెళ్ళగ్రక్కడానికై పరోక్షనిందలు చేస్తాడు ఆ వ్యక్తి. తద్వారా తాను రెండో వ్యక్తిని 'పరోక్షనింద'లకు "అభాండాలకు" గురిచేస్తాడు అతని కించపరచటానికై.

**ఇతరులంటే అయిష్టత :** తనలో అతని పట్ల గల ద్వేషంతో అతని తప్పిదాలను అందరికీ చాటి చెప్పి, పెద్దగా సంతృప్తి చెందుతాడు. తన ద్వేషం సబబుగా ఉన్నట్లు ఇతరులకు చూపిస్తాడు. ఈ దుర్గుణం విశ్వాసుల గుణాల్లోది కాదు.

**అసూయ :** ప్రజలెవరినైతే ప్రేమతో పొగడుతారో వారంటే పరోక్షనిందాపరునికి గిట్టదు. అసూయాపరుడైన, ఆ బలహీన విశ్వాసం గల వ్యక్తి ఈర్ష్యతో ఆ ప్రేమ పొగడ్తలను పొందే వ్యక్తికి ఆ మన్ననలు దూరం కావాలని "నిందలు" వేస్తాడు. ఇక అంతకంటే వేరేమార్గం పరోక్షనిందాపరునికి అగుపడదు.

# చెడు సాన్నిహిత్యం

సన్నిహితులతో కలిసినపుడు వారిపై సుహృద్భావాన్ని చూపటానికో లేదా వారి సంభాషణలను మెచ్చుకోవటానికో లేక పొగడ్తలంటే ఇష్టపడటమో లేక విశ్వాస ఘాతుకం చెయ్యటానికో – పరోక్షనిందలకు పాల్పడతాడు అట్టి వ్యక్తి.

## (గీబ) పరోక్షనిందలు మోపేవారి లక్షణాలు

(గీబ) పరోక్షనిందలకు పాలుపడే వారి నుండి భరించరాని దుర్గంధం వెలువడుతూనే ఉంటుంది. జాబిర్ (ర.అ) యిలా వివరించారు : "మేము దైవప్రవక్త (సఅసం) వారి సముఖంలో ఉన్నపుడు ఒక భరింపశక్యంగాని చెడువాసన కమ్ముకొన్నది. ఆయన (సఅసం) యిలా సెలవిచ్చారు."

“ఈ వాసన ఏమిటో మీకు తెలుసా? అదే ముస్లిమ్‌లపై పరోక్షనింద (గీబ)కు పాల్పడేవారి దుర్వాసన.” (హసన్ : అహ్మద్ ఉల్లేఖన)

(గీబ) పరోక్షనిందకు పాల్పడే వారు తమ సమాధులలో విపరీత శిక్షకు గురౌతారు. దైవప్రవక్త (సఅసం) వారు ఇలా అన్నారు :

“(సమాధిలో ఉన్న) వీరిరువురూ తాము చేసిన (గీబ) పరోక్షనిందల వలన మరియు మూత్రము (తగు పరిశుభ్రత పాటించక పోవడం) వలననే కఠినంగా శిక్షింపబడుచున్నారు.” (సహీహ్ అత్తర్‌గీబ్ వత్తర్‌హీబ్)

“గీబ” పరోక్షనిందకు పాల్పడేవారు – నిర్బలులు మరియు పిరికి వ్యక్తిత్వాలు కలవారు. వారికి ప్రజలకు సూటిగా నిజాన్ని చెప్పే శక్తి లేనందున, ప్రజలతో ముఖాముఖీ భేటీ చెయ్యలేరు. వారే ధైర్యవంతులైతే మాత్రం, మనుషులలోని లోపాలను, తప్పకుండా వారి ముఖాలపైనే కుండపగుల గొట్టినట్లు చెప్పేసేవారు. ఇలాంటి “గీబ” – పరోక్షనిందలకు పాల్పడేవారి వ్యాపారం – నష్టాలతో కూడుకున్న వర్తకమే ఔతుంది. ఎందుకంటే తన సత్కార్య ఫలాలను “గీబ” చెయ్యటం ద్వారా ఆయా వ్యక్తులకు (గీబకు గురైన వారికి) లొంగుబాటు చెయ్యటం జరుగుతుంది. అదే సమయంలో “గీబ”కు గురైన వ్యక్తి తనకు తెలియకుండానే, పరోక్షనిందాపరుని సత్కార్యాఫలాలను పొందుతూ, తన త్రాసు (మీజాన్) భారంలో వృద్ధిని పొందుతాడు.

“గీబ” – పరోక్షనిందలకు పాల్పడేవారి విశ్వాసం అసంపూర్ణంగా కుంఠితమై వుంటుంది. ప్రవక్త (సఅసం) గారు ఇలా అన్నారు :

“మీలోని ఏ ఒక్కడూ తాను తనకై కోరుకొనే వస్తువునే తన సహోదరునికి కూడా కోరేంతవరకూ అకుంఠిత విశ్వాసాన్ని పొందలేడు.”

“మంచిని ప్రోత్సహించడం – చెడును రూపుమాపటం” అనే

సుగుణాలను – పరోక్షనిందాపరుడు నీరుకార్చేసి, హతమారుస్తాడు – మనం నిజంగా ఇస్లామీయ సత్యవాదులైతే కార్యశీలత మరియు కార్యదక్షత కలిగి ఉంటే మనం ఆ లోటు పాట్లు కలిగివున్న వ్యక్తులతో వారి సముఖంలోనే ఆ విషయాలను చర్చించి, సత్కార్యాలను చేయాలని, దుష్కార్యాలను నివారించాలనీ, ఘంటాఫథంగా చెప్పగలుగుతాము. అలా చేయనిచో మనం ఈ ముస్లిమ్ ఉమ్మ (విశ్వాస సమాజము) లోని మంచిని కాలరాసి నిర్మూలించేవాళ్ళం ఔతాము.

## "గీబ" - పరోక్షనిందకై ఉదాహరణలు

"గీబ" – పరోక్షనింద – మనిషి తత్వంలోనే ఉంది. మనిషికి నచ్చని దేనిగురించైనా ఇలా అనటం లాంటిదౌతుంది. "ఈ వ్యక్తి అంధుడు – మెల్లకంటి వాడు – ఒంటికన్నువాడు – పొడగరి – ఎందుకూ కొరగానివాడు – నల్లనివాడు – లేక బట్టతల గలవాడు లేక అట్టి ఇతర గుణాలు / లోటుపాట్లు – (వాటిని ఆపాదిస్తేనే ప్రజలు అయిష్టపడతారు) – 'అనుకరణతో, పరిహాసంగా, ఎకసెక్కెంగా, నవ్వులాటగా అనటం జరుగుతుంది."

"గీబ" – పరోక్షనింద అనేది – ఒక వ్యక్తి పూర్వీకుల గురించో లేక అతని జాతిని గురించో కూడా – చెయ్యటం జరుగుతుంది.

ఉదాహరణకై "ఈ మనిషి ఫలానా కులానికి / తెగకు చెందినవాడు" అని అతనిని 'అల్పుడు'గా చేసే ప్రయత్నం లాంటిది. లేక ఆ వ్యక్తిని వీడు అరబేతరుడు, ఫలానా తెగవాడు, గ్రామీణుడు, ఫలానా దేశస్తుడు" అని అగౌరవపరచే ఉద్దేశ్యంతో తూలనాడటం. లేక "వీడు అసలు ఇలా... ఇలా ... ఉండేవాడు" అనటం. లేక వ్యక్తిని వృత్తి రీత్యా కించపరచటం – వీడు నౌకరుగాడు, వీడు మంగలివాడు" అని అనటం ఈ కోవకే చెందుతుంది. దీనివలన ఆ మనిషి మనసుకు కష్టం కలుగుతుంది."

"గీబ" – పరోక్షనింద – ఒక వ్యక్తి శీలాన్ని శంకించటం "ఈ వ్యక్తి – చాల చెడ్డవాడు, పిసినారి, గర్విష్టి, పిరికిపంద, ఏ బాధ్యతలూ తలపై వేసుకోడు – ముక్కోపి వగైరా అనటం లాంటిదే.

"గీబ" – మతానికీ, ధర్మసూత్రాలకూ సంబంధించినది కావచ్చు, "ఉదాహరణకు ఇలా అనటం, "వాడు దొంగ, అబద్ధాలకోరు, త్రాగుబోతు, ప్రార్థనలను ఎగగొట్టేవాడు, దానం చెయ్యని పిసినారి లేక అతను ప్రార్థనలలో సరిగా వంగడు, సాష్టాంగపడడు లేక తలిదండ్రుల పట్ల క్రూరుడు వగైరా." కానీ ఎవ్వరికీ భయపడకుండా – దైవానికీ తలవంచకుండా అందరిముందటే పాపాలకు పాల్పడే వ్యక్తులను గురించి ఈ విధంగా మాట్లాడటం – గీబ – పరోక్షనింద కానేరదు.

ప్రాపంచిక విషయాలలో కూడా "గీబ" అనేది జరుగుతుంది. ఉదాహరణకు ఇలా అనటం "అతను మంచి నడవడిక లేనివాడు – అతను ప్రజలను కించపరచి మాట్లాడతాడు – అతిగావాగుతాడు – ఎక్కువగా నిద్రపోతాడు, అతని కడుపు చాలా పెద్దది – వగైరాలు."

ఈ విషయాలన్నీ, నిజమే ఐతేమాత్రం "గీబ" – కోవలోకి వస్తాయి. అబద్ధం కాకుండా ఉండే ఇలాంటి విషయాలను ప్రస్తావించే వ్యక్తి – తన సహోదరుని మాంస భక్షణచేసే "పరోక్షనిందాపరుడై" పోవటంతో పాటు, అల్లాహ్ వారి "ఛీత్కారి" కూడా ఐపోతాడు. "గీబ" అనేది నోటితో పలికే వాక్యాల వరకే పరిమితం కాలేదు. "ఒక కదలిక, ఒక మెదలిక, ఒక సంజ్ఞ, మిమిక్రీ –అనుకరణ, కన్నుకొట్టటం, ఏదో (జంతువులలాగా) కేకలు కుప్పిగంతులు వెయ్యటం, ముఖకవళికలను, హావభావాలను మార్చేయటం లాంటి – ఇతరులను కించపరిచి, నీచత్వానికి గురిచేసే ప్రతి శారీరక కదలిక "గీబ" కోవలోకే వస్తాయి. ఇవన్నీ నిషిద్ధమైన చేష్టలే. మేము ఇట్టి దుష్ప్రవర్తనల నుండి అల్లాహ్ శరణు కోరుకుంటున్నాము – ఆమీన్.

మన దృష్టిలో "గీబ" కానటువంటి విషయాలు – కానీ అవి నిజంగా "గీబ"కు పాల్పడటం అయ్యేవిషయాలు.

ఉదాహరణకు, ఒక సోదరుడు అసహ్యించుకునే విషయాన్ని అతనికి ఆపాదించటం – మరి ఎవరైనా అలా చేయకూడదని వారిస్తే, "ఈ విషయాన్ని అతని సమక్షంలోనే చెప్పటానికి తయారుగా ఉన్నాను" అని అనటం. పలు కారణాల పరంగా యిటువంటి ప్రవర్తన ఖండింపబడినది – అందులో ముఖ్య అంశం – నిశ్చయంగా తన సోదరుడి పరోక్షంలో అతనిపై కొన్ని ఆరోపణలు చేయబడ్డాయి. ఇది పరోక్షనిందే (గీబ) ఔతుంది. "అతని ప్రత్యక్షంలోనూ 'నిందారోపణ' చేస్తాననటంతో "పరోక్షనిందా పరునికి" ఎలాంటి ఆరోపణలుచేసే న్యాయపరమైన హక్కు ఒనగూడదు."

మరో వ్యక్తి ఇలా అంటాడు, "కొంతమంది ఇలా... ఇలా.... చేస్తారు లేక ఫలానా ఇస్లామీ ధర్మశాస్త్రవేత్త ఇలా ... ఇలా.... చేస్తాడంటూ..." – ఎదుటి వారికి పేరు చెప్పకుండానే – ఆ వ్యక్తి ఎవరో అందరికీ అర్థమయ్యేలాగా మాట్లాడతారు. చెప్పాల్సిందేదో సూటిగా కాకుండా డొంకతిరుగుడుగా చెప్పబడుతుంది.

లేక ఏదో సహోదరుని గురించి ఎవరైనా అడిగితే "అల్లాహ్ మనల్ని సరిదిద్దుగాక, అల్లాహ్ మనల్ని క్షమించుగాక, మేము అల్లావారిని శరణు కోరుతున్నామని లేక అలాంటి అర్థం వచ్చేమాటలే మాట్లాడతాడు." దీనివలన ఆ సహోదరునిలో లోటుపాట్లు వున్నట్లు తెలిసిపోతుంది మిగిలినవారికి.

"ఫలానా ఫలానా వ్యక్తి ఫలానా ... ఫలానా కష్టాల్లో మునిగి ఉన్నాడని" అనటం కూడా ఈ కోవలోకే వస్తుంది. మనమందరమూ ఇలాగే అంటుంటాము మామూలుగా.

ఒక వ్యక్తి యిలా అంటాడు "ఇతడు వయసులో చిన్నపిల్లవాడే కాబట్టి పరోక్షనిందలు ఆపాదించవచ్చు." ఇదో వితండవాదం మాత్రమే. ఇలాంటి పని చెయ్యవచ్చుననడానికి ఎక్కడా ఎలాంటి సూచనలూ లేవే.

ఎలాంటి ఆంక్షలూ హద్దులూ లేకుండా ఒక 'పాపి'ని పరోక్ష నిందలకు గురిచెయ్యటమనేది సరియైన పనికాదు. దైవాజ్ఞలను తూ.చ. తప్పక అనుసరించని ప్రతి వ్యక్తిపై నిందారోపణ చెయ్యటం సాధ్యపడదు.

అలాగే అయితే పాపరహితుడైన ఒక విశ్వాసి కూడా ఈ ప్రపంచంలో ఉండడని, అందరిపైనా ధ్వజమెత్తడం ఆమోదయోగ్యం కాదు. ఒక వ్యక్తి "గౌరవప్రదమైన" రాజు గారు / పాషా గారు / ల్యాండ్ లార్డ్ లాంటి పొగడ్తలతో ఇతరులను ఆకాశానికి ఎత్తివేసినా – ఆ వ్యక్తి అసలు ఉద్దేశ్యం మటుకు ఇతరులను కించపరచటం మాత్రమే. తాను మాత్రం అలాంటి సంబోధితాలను ఇతరుల నుండి వినటానికై తయారుగా ఉండడు.

## (గీబ) - పరోక్షనిందకు చికిత్స

వ్యక్తిలోని 'పరోక్షనిందా' – తపనను సరిదిద్దడానికై రెండు మార్గాలున్నాయి.

**మొదటిది** – చేసిన నిర్వాకానికి (గీబ) పశ్చాత్తాపం చెందటం. – అంటే తాను "గీబ"కు పాల్పడితే అల్లాహ్ వారి కోపతాపాలకు, శిక్షలకు అర్హుడౌతానని తెలుసుకోవటం. మరో విషయం – పునరుత్థాన రోజున తన స్వార్జిత సత్కార్య ఫలాలు, పరోక్ష నిందలకు గురైన వ్యక్తి ఖాతాలో జమ చేయబడతాయి అనే సత్యాన్ని నెమరువేసుకోవటం. అందుకని, ప్రతి వ్యక్తీ హృదయపూర్వకంగా పశ్చాత్తాపం చేసుకోవటం, అనివార్యమై పోతుంది. చేసిన పాపానికి దుఃఖాన్ని వ్యక్తపరుస్తూ, భవిష్యత్తులో ఆ

పాపానికి ఒడిగట్టనని దీక్షపూనడం – చేసిన పాపాలకై అల్లాహ్ వారిని క్షమాభిక్ష యాచించటం – ఒకవేళ తాను చేసిన నిందారోపణలు ఆ వ్యక్తికి తెలిసినట్లయితే – దీనికి పరిహారంగా అదే వ్యక్తి నుండి క్షమాయాచన చేయటం అత్యవసరం. తాను ఆపాదించిన 'నిందలు' అతని వరకు చేరని సందర్భంలో తాను "నిందాబాధిత" వ్యక్తికై ప్రార్థనలు చేసి, అతనికై అల్లాహ్ నుండి క్షమాభిక్ష కోరాలి. పైగా తాను చేసిన చెడువ్యాఖ్యానాలకు బదులుగా అతనిని గురించి, అతని సుగుణాలను గురించీ మంచి మాటలే మాట్లాడాలి. పైన ఉదాహరించిన రెండు పరిస్థితుల్లోనూ, పరోక్షనిందాపరుడు తాను ఏ వ్యక్తుల సమక్షంలో ఈ పాపకార్యానికి పాల్పడ్డాడో – వారి ముందే తిరిగి తాను చేసిన ఆరోపణలను వెనుకకు తీసుకోవాలి – మళ్ళీ అలాంటి పని చేయనని స్థిర నిశ్చయం చేసుకోవాలి.

**ఇక రెండవ చికిత్స** : తాను ఎట్టి పరిస్థితుల్లో 'నిందారోపణలకు' పాలుపడ్డాడో అవలోకనం చేసుకోవాలి. నిశ్చయంగా సమస్యను సమూలంగా నిర్మూలించాలంటే దాని మూల కారణాన్ని కనుగొని తగిన చికిత్స చేసుకోవాలి. వివేకవంతుడైన వ్యక్తి "గీబ"కు దారితీసే అసలు కారణాలను నిర్మూలించి – హృదయ స్వస్థతకు కావలసిన ఔషధాలను, చికిత్సా విధానాన్ని ఎన్నుకొంటాడు. ఇతరుల లోటుపాట్లను లెక్కవెయ్యటం కంటే తనలోని లోటు పాట్లను, తత్సంబంధిత ఆవశ్యకతలను మదిలో తలంచి, నెమరు వేసుకుంటాడు. 'మంచి' తప్ప వేరేదీ మాట్లాడకుండా తన జిహ్వను రక్షించుకొంటాడు. ఈ విధంగా అతడు ఈ భౌతిక ప్రపంచంలోనూ, అటు పరలోకంలోనూ "మంచిని" పొందటానికై అర్హుడౌతాడు.

# “గీబ” - లో ఆమోదయోగ్య అంశాలు

ఇమామ్ అన్ న్నవవీ తన గ్రంథం “అల్ అద్‌కార్”,లో ఇలా విశదీకరించారు – “ఇస్లామ్ ధర్మపరమైన, అనుమతింపబడిన ఈ ఆరు (6) కారణాల వలన “గీబ” ఆమోదయోగ్యం ఔతుంది.”

1. జరిగిన అన్యాయానికై మొరపెట్టుకోవటం : అన్యాయాలకూ, అరాచకాలకూ గురైన బాధితులు తమకు కలిగిన యాతనలను గురించి ముస్లిమ్ పాలకులకు, లేక న్యాయాధిపతిలాంటి ఇతర అధికారులకు “ఫలానా వ్యక్తి ఈ దుర్మార్గానికి ఒడిగట్టాడని” లేక “ఫలానా ఫలానా దుష్కార్యం చేశాడని లేక లంచం రాబట్టుకొన్నాడనీ” ఫిర్యాదు చేసుకోవచ్చు.

2. చెడును మంచిగా మార్చటానికై, ఇతరుల సహాయం కోసం మరియు చెడును తిప్పికొట్టటం కోసం.

ఉదాహరణకు “మత్తు పానీయాలు” త్రాగే వ్యక్తి గురించి అతని సంరక్షకుని తెలుపటం – దీనిలోని ఉద్దేశ్యం ఆ త్రాగుబోతును సంస్కరించటానికై, మరియు సంఘంలో త్రాగుడు అనే కీడును నివారించడానికై “గీబ”కు పాల్పడటం సమంజసమే ఔతుంది అలాంటి పరిస్థితుల్లో.

3. ఇస్లామీ ధార్మిక నిర్ణయాలను కోరటం : ఒక వ్యక్తి “ముఫ్తీ” (ఫత్‌వాలను ఇచ్చే ఇస్లామీ విద్యావేత్త)ను తన తండ్రి లేక సహోదరుడు ఫలానా పని ద్వారా తనకు అన్యాయం చేశాడని చెప్పటం. ఇస్లామ్‌లో యిలా చెప్పటం ఆమోదయోగ్యమే. “అబూ సుఫియాన్ పిసినారి” అని హింద్ బిన్‌తె ఉత్‌బా ఆరోపణ చేసిన ఆ ‘హదీసు’ ద్వారా ఈ కార్యం మనం చేయవచ్చుననీ, ఆమోదయోగ్యం అనీ తేటతెల్లం అయిపోయింది. (అల్ బుఖారీ ఉల్లేఖనం)

4. ముస్లిమ్‌లను 'చెడు' గురించి హెచ్చరించటం : ఒక ముస్లిమ్ చెడు వ్యక్తి సహవాసం చేస్తే లేక పాపాలుచేసే, లేక మతంలో కొత్త పోకడలకు నాందివేసే వ్యక్తితో స్నేహం చేస్తే, ఆ ముస్లిమ్‌ను అట్టి వారి నుండి కాపాడటానికై "గీబ" ఆపాదించటం సమంజసమే ఔతుంది. అందువలన మంచి వ్యక్తి ఆ ముస్లిమ్‌కు 'దుర్మార్గుల'ను గురించి ఉపదేశం చేసి, హెచ్చరిస్తాడు. అలాగే ప్రవక్త (సఅసం) వారి ప్రవచనాల పరిరక్షణకై "అసత్యవాదులను" - "కాల్పనిక ఉల్లేఖకులను" "హదీసుల సత్యాసత్యాలను తారుమారు చేసే దుష్టశక్తులను" గుర్తింపు చేయటానికీ మరియు అట్టి వారిని సౌశీల్యులైన ఉల్లేఖకుల నుండి వేరుచేయటానికై "గీబ" పరోక్షనింద చేయటం అతి సమంజసమే. మరీ ఎవరైనా సలహాలకై, సంప్రదింపులకై తమకు విశ్వసనీయులుగా గుర్తింపు పొందినవారి వద్ద ఆ విషయ ప్రస్తావన చేయవచ్చు. ఉదాహరణకు ఎవరైనా వేరే వ్యక్తి గురించి మూడో వ్యక్తితో సంప్రదిస్తాడు - ఉద్యోగాన్వేషణకై లేక తన బంధువులలోని ఒక స్త్రీతో అతని 'నికాహ్' జరపాలనో, లేక అతనితో కలసి వ్యాపారం చెయ్యటానికో, ఆ వ్యక్తిని గురించి మూడో వ్యక్తి నుండి అతని అభిప్రాయాన్ని తెలుసుకోగోరటం. ఇలాంటి విషయాల్లో ప్రశ్నింపబడిన వ్యక్తి. ప్రశ్నించే వ్యక్తికి, నిశ్చితమైన, సరియైన సమాధానం యివ్వటం తప్పనిసరి.

అట్టివాడు (ప్రశ్నింపబడిన వ్యక్తి) నిజానిజాల్ని ఎలాంటి దాపరికం లేకుండా అడిగినవారికి తగు సలహా ఇవ్వటం శ్రేయస్కరం.

5. బాహాటంగా పాపాలుచేసే లేక మతంలో కొత్త పోకడలను సృష్టించే వ్యక్తుల గురించి "గీబ" చెయ్యటం ఆమోదయోగ్యమే. ఇలాంటి పరిస్థితుల్లో అడగబడ్డ ఆ వ్యక్తి గురించి అన్ని విషయాలూ బాహాటంగానే చెప్పవచ్చు. కాని అట్టి వ్యక్తి ఇతర విషయలను గూర్చి చర్చింపరాదు. - వేరే యితర సమంజస కారణం ఉంటే తప్ప.

6. ఎవరిని గురించి మాట్లాడాలో స్పష్టంగా ఫలానా వ్యక్తి అని చెప్పటం : ఈ పరిస్థితుల్లో వ్యక్తులకు ప్రజలు పెట్టిన మారుపేర్లను కూడా వాడవచ్చును. ఇందులో ఎలాంటి అమర్యాద లేదు. "కుంటివాడు" 'గుడ్డివాడు' లాంటి పర్యాయనామాలతో పిలవటం "గీబ" కోవలోకి రాదు.

## ఆమోదయోగ్యమైన "గీబ" - పరోక్షనిందారోపణ చేసే సమయంలో గమనింపవలసిన విషయాలు :

ఈ మార్గంలో మనం చేసే పనులన్నీ అల్లాహ్ వారికి ఆమోద యోగ్యం కావాలనే మనోకాంక్షను తమ హృదయాలలో నెలకొల్పుకోవాలి. వీలైనంత వరకు "గీబ"కు గురయ్యే వ్యక్తి ఎవరనేది ప్రత్యేకంగా చెప్పకుండా వుంటే లేనిపోని అనుమానాలకు తావుండదు.

ఇలా "గీబ" చేయటం వలన, సామాజికపరంగా సమాజానికీ, ముస్లిమ్‌లకూ లాభదాయకం అయితేనే ఆ సోదరుని గురించిన విషయాలు బహిర్గతం చెయ్యాలి.

ఇలా పరోక్షనింద చేయటం వలన ఫితన, కీడు, లాంటి విపరీత పర్యవసానాలూ, ఒనగూడే 'మంచి'ని మించిన దుష్పరిణామాలూ ముస్లిమ్‌లకు కలుగకుండా తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

## "గీబ" కంటే హేయమైన దేమిటి?

ముస్లిమ్‌లు చవిచూసే ప్రాపంచిక ఆపదలకు, కష్టాలకూ ముఖ్యమైన కారణం – వ్యక్తుల పాపకార్యాలకు లేక వారిలోని లోటుపాట్లకు, కాకుండా ఇతర విషయాలకై పరోక్షనిందకు పాల్పడటం. సాంస్కృతికపరమైన లేక సమాజ తీరుతెన్నుల ప్రకారం ఉండే అలవాట్లను సరిచేసే పద్ధతులను ఆమోదయోగ్యంగానో లేక నిషిద్ధ యోగ్యంగానో మార్చటానికై ప్రయత్నం చేయటం. ముఖ్యంగా అత్యున్నతమైన అల్లాహ్ వారి విషయాలలో 'ద్వంద్వనీతిని' అనుసరించటం. ఉదాహరణకు : ఒక వ్యక్తి తన దుస్తుల

విషయంలో చాల నిగర్విగా, దుబారాచేయని వ్యక్తిగా అగుపడతాడు – కాని యదార్థం అందుకు భిన్నంగా ఉంటుంది. ఆ విషయం తెలియని వ్యక్తి ఇలా అంటాడు, “ఈ పిసినారిని చూడండి. ప్రాపంచిక జీవనాన్ని తనకై నిషేధించుకున్నాడు. మన ఐహిక జీవితాలనూ మట్టిలో కలపాలనే ఈ వ్యక్తిని చూడు”. దీనికి భిన్నమైనది కూడా జరుగుతుంది. ఉదాహరణకు : ఒక వ్యక్తికై ఓ ఇల్లో లేక ఓ జంతువో అల్లాహ్ వారు ప్రసాదించారు. ప్రజలు ఇలా అంటారు, “ఆయన్ని చూడండి. నిశ్చయంగా అతడు ముస్లిమ్‌ల విషయాల్లో అల్లాహ్ వారికి భయపడిలేడు. ఆ ఇంట్లో నివసిస్తూ లేక ఆ జంతువుపై ఆశీనుడై సంచరిస్తూ కూడా ముస్లిమ్‌ల గురించి పట్టించుకోడు.” మరింకా ఎన్నో అంటారు. అలా ఆ వ్యక్తి ఎందుకు చేస్తాడో సూక్ష్మదృష్టితో పరిశీలిద్దాం – అటు తర్వాత ఆలోచించి సింహావలోకనం చేద్దాం. మొదటిది మనం ఆ వ్యక్తిని గురించి అలా మాట్లాడటానికీ, అతనిని చీవాట్లు వేయటానికి మనకేదైనా న్యాయపరమైన హక్కు సంక్రమించిందా? అతడు అల్లాహ్ వారి రుజుమార్గంలో శ్రమపడ్తాడో లేదో అనే అతని రహస్య విషయం మనకెలా తెలుస్తుంది. అతను అల్లాహ్ వారు తన అపార ధనాగారాల నుండి తనకు ప్రసాదించిన కానుకలను వరాలను తిరస్కరిస్తాడా లేక అందులోనుండి ఇవ్వవలసిన పరిమాణంలో దానం చేస్తున్నాడా లేదా? ఓ పాఠకుడా అల్లాహ్ అంటే భయపడు, ముస్లిమ్‌ల మానమర్యాదలకై, వారి శరీర మాంసాలకై అల్లాహ్ అంటే భీతికలిగి ఉండు. పైన ఉదాహరించిన పాపాల నుండీ, దుష్కార్యాల నుండీ మరియు అజ్ఞానం నుండీ మన సంరక్షణకై అల్లాహ్ వారి శరణు కోరుకుంటున్నాము. (ఆమీన్)

“గీబ” – పరోక్షనిందకు పాల్పడాలనే అభిలాషతో పోరాటం జరపటమే ఉత్తమమైన జిహాద్ (ధర్మపరిరక్షణ)

దైవప్రవక్త (సఅసం) వారు ఉపదేశించారు ఇలా : “ఉత్కృష్టమైన

'జిహాద్' అంటే తన శరీరంతో మరియు తన ఐహిక కాంక్షలతో పోరాటం చెయ్యటమే." (సహీహ్ అల్ జఅమి – 1099 మరియు అస్సహీహ – 1496)

ఆయన (సఅసం) మరీ అన్నారు :

"ఎవరైతే అల్లాహ్ కొరకై తన 'స్వయం'తో తానే సంఘర్షణ చేస్తాడో అతడే 'ముజాహిద్' (జిహాద్ చేసే వ్యక్తి)." (సహీహ్ అల్ జఅమి – 6679)

# ముగింపు

చివరిగా ప్రవక్త (సఅసం) గారి ఈ సందేశాన్ని మీ దృష్టికి తీసుకొస్తున్నాం.

"ఓ, మీ జిహ్వాలతో విశ్వాస ప్రకటన చేసిన మీరూ! విశ్వాసం ఇంకా మీ హృదయాంతరాళాలను చేరలేదు. ముస్లిమ్‌లపై పరోక్షనింద (గీబ) చెయ్యకండి. మరియు వారి తప్పిదాలను ఎన్నుకోకండి. నిశ్చయంగా ఎవరైతే, వారి (ముస్లిమ్‌ల) తప్పులను ఎన్నటానికై ఆరాటపడతారో, అట్టి (పరోక్షనిందాపరుల) వారి తప్పులను అల్లాహ్ వారు గమనించి లెక్కవేస్తారు. (ఆయన మీ తప్పులను కప్పిపుచ్చడూ, మిమ్మల్ని క్షమించడూ). మరి అల్లాహ్ ఎవరి తప్పిదాలను అన్వేషిస్తారో, అట్టి వ్యక్తిని అవమానం పాలు చేస్తాడు – అతని స్వగృహంలో కూడా." (సహీహ్ అబూ దావూద్)

ఒక వివేకవంతుడు ఎన్నడో ఈ సత్యాన్ని చాటి చెప్పాడు – "గీబ" పరోక్షనిందలు ఆపాదించటం – పాపాత్ములకై ఓ ఆహ్లాదకర సాధనం – స్త్రీలకై పచ్చిక మైదానం – మరియు ప్రజా శునకాలకై మాంసపు ముక్కల భండారం లాంటిదని.

అందువలన, అల్లాహ్ వారు, ముస్లిమ్‌లనందరినీ – చెడు జిహ్వా జనిత చాపల్యాల నుండీ – తద్వారా సంక్రమించే నరకాగ్ని జ్వాలల ప్రకోపాల (శిక్షల) నుండీ కాపాడమని వేడుకొంటున్నాం. ఈ పుస్తకాన్ని చదివేవారినీ, దీనిలోని జ్ఞానాన్ని విస్తృతపరిచేవారినీ, ఇందులోని మూలసూత్రాలను విని, గ్రహించి, అమలుచేసేవారినీ, జ్ఞానజ్యోతులతో నింపివేయాలని కోరుకుంటున్నాము. చదువరులనూ, ఈ పుస్తక కర్తలనూ ఒక త్రాటిపై సమీకరింపజేసి ఆ స్వర్గంలోని ఆహ్లాదకరమైన "ఫిర్‌దౌస్" వనంలో ప్రవేశపెట్టాలనీ ఈ పుస్తకాన్ని మాకై ఒక అనుకూలమైన మంచి సాక్షిగా, మాకు ప్రతికూలం కాకుండా వరమివ్వమని అల్లాహ్‌ను అర్థిస్తున్నాము.

అల్లాహ్ వారి శాంతి, వారి కరుణామృత దీవెనలు దైవప్రవక్త (సఅసం) వారిపై, వారి గృహస్తులపై మరియు వారి అనుచరులపై సదా ప్రసరించుగాక! (ఆమీన్ యా రబ్బల్ ఆలమీన్)

*-: సమాప్తం :-*

**Note :** All good things are from ALLAH (S.T.). All errors/mistakes in this Book belong to Abdullah. You are requested to notify such short comings to him without any hesitation.